# శ్రీశ్రీశ్రీ మహాకామేశ్వరి దేవత

## పూజా విధాన వ్రతకల్పము










శ్రీశ్రీశ్రీ మహాకామేశ్వరి దేవత కొలువు మండపము

# శ్రీశ్రీశ్రీ మహాకామేశ్వరి దేవత

## పూజా విధాన వ్రతకల్పము





సంకలనం :

**ఆకుండి నారాయణమూర్తి**
**ఆకుండి శకుంతల**

ప్రథమ ముద్రణ : 2002

ద్వితీయ ముద్రణ : 2006

ప్రతులు : 1,000

వెల : **అమూల్యము**

ప్రాప్తిస్థానములు :

**ఆకుండి నారాయణమూర్తి**
49-34-5, ఫ్లాట్ నెం. 301, గీతా మేన్షన్ -2,
అక్కయ్యపాలెం మెయిన్ రోడ్, ఆంధ్రాబ్యాంకు ఎదురుగా,
విశాఖపట్నం-530 016.
**ఫోన్ : 0891-2556960.**
e-mail : akundinarayanamurthy@yahoo.com

**ఆకుండి కృష్ణమూర్తి**
**C/o. A.V.K. రావు** ఫ్లాట్ నెం. 1, హేపి హోమ్స్,
యమ్.ఆర్. కృష్ణ రోడ్, ఆల్వాల్,
సికింద్రాబాద్ - 500 010.
**ఫోన్ : 55278702**

**నిష్టల వెంకట సూర్యనారాయణమూర్తి**
చౌదంతివలస, వయా రామభద్రపురం,
విజయనగరం జిల్లా - 535 579
**ఫోన్ : 08944-258271**

ముద్రణ :
ఎక్వేరియన్ ప్రింటింగ్ స్కూల్,
సుబ్బలక్ష్మీనగర్, విశాఖపట్నం-530 016.
☏ 0891-2747320.

# స్మృత్యంజలి

## కీ॥శే॥ ఆకుండి నరసింహం

**(జులై 1906 - సెప్టెంబరు 2004)**

వ్యవస్థాపక ప్రధానోపాధ్యాయుడు (ఎలిమెంటరీ స్కూలు చౌదంతివలస)



కుమారులు & కోడళ్ళు :

**ఆకుండి నారాయణమూర్తి - చి॥సౌ॥ శకుంతల**

**ఆకుండి కృష్ణమూర్తి - చి॥సౌ॥ నాగరత్నం**

కుమార్తెలు & అల్లుళ్ళు :

**గం॥భా॥స॥ పంతుల సీతాలక్ష్మి**

**చి॥సౌ॥ భాగవతుల వెంకటరత్నం - నారాయణరావు**

మనుమలు, మనుమరాండ్రు, మునిమనుమలు, మునిమనుమరాండ్రు.

# కీ॥శే॥ ఆకుండి నరసింహం

**(1906 - 2004)**

**జననం :** శ్రీ పరాభవ ఆషాఢ బహుళ త్రయోదశి- నారాయణ - రామమ్మ గార్ల తృతీయ సంతానంగా సదాచార బ్రాహ్మణ కుటుంబంలో.

**విద్య :** మిడిల్ స్కూలు వరకు. స్వయంకృషితో సనాతన గ్రంథముల అధ్యయనం.

**వృత్తి :** తన 14వ ఏట స్వగ్రామం చౌదంతివలసలో ప్రాథమిక పాఠశాల స్థాపన. వ్యవస్థాపక ప్రధానోపాధ్యాయునిగా కొనసాగింపు. చిన్నతనంలోనే కుటుంబ పోషణభారం వహింపు. కృషి - గోరక్ష, పాడిపంట స్వయంకృషితో సాధింపు.

**వివాహం :** బాల్య వివాహం తన 13వ ఏట గుణానుపురం అగ్రహారీకులైన పాలంకి కృష్ణశాస్త్రి - వెంకమ్మల కనిష్ఠ పుత్రిక సత్యవతి(7)తో.

**సంతానం :** ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. వారికి కథల రూపంలో భారత, భాగవత, రామాయణాది సద్గ్రంథ పరిచయము. కృష్ణ, దాశరథి, నారసింహ, సుమతీ శతకాదుల బోధన, సన్మార్గ నిర్దేశము.

**సామాజిక జీవనం :** స్వాతంత్రోద్యమంలో మహాత్మాగాంధీగారి సిద్ధాంతాల అనుసరణ. తనదైన శైలిలో సత్యాగ్రహం, రాట్నంతో నూలు వడకుట, ఖద్దరు / చేనేత వస్త్రధారణ, వార్తా పత్రికలు చదివి వినిపించి పామరులను చైతన్యపరచుట, వయోజన విద్య నేర్పించుట, గ్రామస్థులకు వివిధ విషయములలో సహాయం, మార్గదర్శకత్వం.

**పరమ పదము :** తన 99వ ఏట, తేది 15-9-2004 విశాఖపట్నంలో.

ఈ పుస్తకములోని శ్రీ మహాకామేశ్వరి దేవత పూజా క్రమమును తొలుత కూర్పు చేసినవారు బ్రహ్మశ్రీ **వేదమూర్తులైన శ్రీ ముద్దు శ్రీరామమూర్తిగారు** (విశాఖపట్నం).

ద్వితీయ ముద్రణ పుస్తకమునకు సహాయపడినవారు స్మార్త పురోహితులైన శ్రీ **ఆకుండి చిరంజీవిరావు (వాసు)గారు** (విశాఖపట్నం-1).

---

శ్రీ కామేశ్వరీ దేవత కొలనుపాటలోని సంకేతపదముల అర్థమును, నిగూఢ రహస్యములను విప్పి, విశదపరచిన దివ్యజ్ఞాన సంపన్నులు 'ఋషిపీఠం' భారతీయ మానస పత్రిక వ్యవస్థాపక సంపాదకులు ఆర్షధర్మోపన్యాసకేసరి సమన్వయ సరస్వతి, సమన్వయ సామ్రాజట్ **బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖ శర్మగారు,** హైదరాబాద్.

# విషయసూచిక

శ్రీ మాత్రే నమః ।

# తొలిపలుకు

**వాగార్థా వివసంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే ।**
**జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ ॥**

'నిత్యః శబ్దార్థ సంబంధః' శబ్దార్థములకు నిత్య సంబంధమున్నది. ఎడతెగని సంబంధము అని అర్థము. పంచతన్మాత్రలలో శబ్ద తన్మాత్ర మహాశక్తివంతమైనది. ఈ శబ్దశక్తిచేతనాత్మకమగు ప్రాణికోటి యందు అనగా మనుష్య జీవరాశియందు 'పరా పశ్యన్తీ మాధ్యమా వైఖరి' అను నాలుగు విధములగు వాగ్దేవతారూపముగ ఉన్నది. వైఖరీ వ్యక్త వర్ణ రూపముగా మనుష్యుల యందు, అవ్యక్త, వర్ణ రూపముగా పశు పక్ష్యాది జంతువుల యందు కానవచ్చుచున్నది. వైఖరీ శబ్ద శక్తి లేనిదే ఏ భాషకు భావ ప్రకటన కానేరదు. కనుకనే ఆ శక్తి భాషాస్వరూపిణి. భావము పదార్థమును వ్యక్తము చేయుచున్నది. పదార్థమే దృశ్యమాన జగత్తు. అదియే విశ్వము. దానినే బ్రహ్మాండమందురు. అటువంటి బ్రహ్మాండములు మనకు కనపడనవి అనేక కోట్లు కలవు. 'అనేక కోటి బ్రహ్మాండ జనని.' వీటి ఉనికిని, స్వభావమును తెలిపినవే వేదములు. వేదములు శబ్ద ప్రధానమైనవి, ప్రభు సమ్మితములు కనుకనే వేదములు స్వతః ప్రమాణములు, "శబ్దాత్మికా సువిమలర్గ్యజుషాంనిధానం" అని ఆశక్తిని స్తుతించిరి.

వేదములచేత ప్రతిపాదితమైన విషయము పరమాత్మ. అదియే "చిత్." వాగ్దేవతాచతుర్విధమువలె ఆత్మ చతుర్విధము కలదు. ఆ ఆత్మనే "పురుష" అని వేదము వర్ణించినది. అందు ఏకపాద్విభూతి దృశ్యమాన జగత్తు యందు ఏకాకారముగా ప్రాణికోటి యందు వ్యాపించి యున్నది. త్రిపాద్విభూతి బ్రహ్మాండ కక్ష్యకు ఆవల, మహాగాఢాంధకారము తరువాత స్వయం ప్రకాశముగా అలరారుచున్నది. అది అన్నింటినీ ప్రకాశింప జేయుచూ జ్ఞానరూపముగా అనంతమై, పరమాత్మగా వేదములచేత తెలియనగుచున్నది. "వేదాహమేతం పురుషం మహాంతం, ఆదిత్య వర్ణంతమ సఃపరస్తాత్" అని వేదము చెప్పుచున్నది. కనుకనే ఆ పరమాత్మ వేదవేదాన్త వేద్యుడు. ప్రతి బ్రహ్మాండము నందు ఆపరమాత్మ స్వయముగా, సృష్టికర్తగా బ్రహ్మయై, స్థితిరూపమున విష్ణువై, లయకారకు డగు రుద్రునిగా సాకారుడై సృష్టి కార్యమును సాగించుచున్నాడు. త్రిమూర్త్యాత్మకమగు పరమాత్మమాయా శబలితచైతన్యము. సృష్టికార్యము మాయా సహాయ ముతో జరుగుచున్నది. వేదప్రతిపాద్య విషయమునకు వేదమునకు ఎడతెగని బంధము కలదు. కనకనే వాయు సంహిత ఇలా చెప్పుచున్నది. 'శబ్ద స్వరూప మఖిలంధత్తే శర్వస్య వల్లభా, అర్ధ స్వరూప మఖిలంధత్తేముగ్ధేందు శేఖరః' అని. అదియే పార్వతీ పరమేశ్వర తత్వము. ఆ పార్వతీ పరమేశ్వరులే కామ–కామేశ్వరీలు.

కామేశ్వరీ కొలువు అనగా, పరాశక్తి కొలువే. కామేశ్వరీ కొలువు కొందరి వంశములకు నియతముగా యున్నది. ఈ కామేశ్వరి వాక్కును ప్రసాదించినదై ఆకుండి వారిచే కొనిరాబడి, చౌదంతివలసలో స్థిరమై యున్నది. చౌదంతివలసకు నాకు పూర్వము కొంచెము అనుబంధ

మున్నది. చౌదంతివలస గ్రామంలో అప్పటికి కొన్ని సంవత్సరముల నుండి రామాలయము ప్రతిష్ఠ చేయాలని ప్రయత్నం. డబ్బు చేతపుచ్చుకున్నా విఫలం. ఆ ధనం స్వార్థపరుడైన అన్యునకు సుఫలం. ఇలా జరుగుచుండగా రేపు ప్రతిష్ఠ అనగా బొబ్బిలి నుండి కబురుంపినారు, రేపు ప్రతిష్ఠా సంకల్పమని. గ్రామస్థుల చేతిలో ఒక చిల్లి గవ్వలేదు. గ్రామమా, పాటవ జనం. ప్రతిష్ఠా కార్యక్రమము అసామాన్యమైనది. ఆ గ్రామమున ఎలా చేయాలి, ఏమి ఆలోచన లేదు. ఆ కుగ్రామంలో కొలువైయున్న కామేశ్వరి అన్నింటికి ప్రణాళిక తయారు చేసికొన్నది. నిష్టల సూర్యనారాయణమూర్తి, సూర్యకాంతం దంపతులు ముఖ్య సహకారము అందించినారు. సూర్యకాంతం ఆకుండి వారి ఆడపడుచు అగుట వలన ఐదు రోజుల ప్రతిష్ఠా కార్యక్రమం పైసా లేకుండా గ్రామస్థుల ప్రోత్సాహముతో పవిత్రంగా, ప్రశాంతంగా సాగింది. చివర అన్నదానం చేయాలి. "అన్నహీనం దహేద్రాష్ట్రం." ఆకుండి వారిచే మొదటగా తీసుకురాబడి ఏతమ్మయ్య శాస్త్రి గారింటిలో ఉంచబడినదో యిప్పటి రాయుడమ్మగారి యిల్లుగా చెలామణి అగుచున్న ఆ యింటిలో రాత్రి 11 గంటలకు నేను అక్కడ వుండగా నిష్టలమూర్తి దంపతులను వెంటపెట్టుకొని గ్రామస్థులు నా వద్దకు వచ్చి, ఒక దోసెడు బియ్యం మీరు వెయ్యండి అని అడిగినారు. దాని ప్రభావంతో శేరు బియ్యం లేని పరిస్థితిలో తెల్లవారేటప్పటికి వేలకొలది గ్రామ సమారాధన అయినది. అది కలగా, కథగా మిగిలినదేగాని, అప్పటి సన్నివేశమును మరువలేము. ఆ శక్తి కామేశ్వరిదే. ఆమె ప్రణాళికలోనిది. ఆ విధముగా ప్రచోదకులైన సూర్యకాంతం మూర్తి దంపతులే నిలబడి ఈ మహా

మంటప నిర్మాణమునకు దోహదము చేసినారు. ఆకుండి నారాయణ మూర్తి, శకుంతల దంపతులు వారి కుటుంబము ధనము వెచ్చించి, కామేశ్వరీ మాతకు శాశ్వత పటిష్ట పూజాగృహమును నిర్మించినారు. పైన చెప్పిన ఆ కొద్దిపాటి అనుబంధము నేను చెప్పకపోతే తల్లిపట్ల కృతఘ్నుడ నగుదును. అందుకు ఈ విషయము తెలిపినాను. అక్కడ శక్తి, సామాన్యమైనది కాదు.

పూజా విధానమును తిలకించినాను. దానికి శంకరుల వారి కామేశ్వరీ మంత్రాక్షర మాలికా శ్లోకములు అనుసంధానము చేయుట కూడా సాంప్రదాయము కలదు. మొదటి శ్లోకం :

శ్లో॥ ఏణాంకానస భానుమండల లసచ్ఛీచక్రమధ్యస్థితాం
బాలార్కద్యుతి భాసురాం కరతలైః పాశాంకుశౌభిభ్రతీం ।
చాపం బాణమపి ప్రసన్నవదనాం కౌస్తుంభ వర్ణాంశుకామ్
త్వాం త్వాం చంద్రకళావతం స మకుటా చారుస్మితాం భావయే ॥

ఆ శ్లోకములు, ఉపచారమంత్రార్థమును, మూలమంత్రార్థమును, పరదేవతా తత్త్వమును కూడా తెలుపుచున్నవి. కామేశ్వరీ చరిత్ర, సంప్రదాయము గోత్రములు తెలియని ఈ రోజులలో గోత్ర ప్రవరలతో వంశమును ఆరామ ద్రావిడ వ్యవస్థ తెలుపుట ఎంతయినా మంచిది.

ఈ గ్రంథము చౌదంతివలస గ్రామము వారికి చరిత్రాధార ముగను, పరదేవతా మంత్రోపాసకులకు కామేశ్వరీ తత్త్వమును తెలిసి

కొనుటకును, కామేశ్వరీ కొలువు సంప్రదాయము కలవారికి శుభ కార్యము లందు కామేశ్వరీ పూజావిధానమును నడుపుకొనుటకు ప్రతివారు లలితా సహస్రనామస్తోత్రము చేయుదురు కనుక ఆ విధముగను, ఆరామద్రావిడ వంశజులకు, గోత్ర ప్రవరలు ముఖ్యముగా తెలియుటకును, యిలా అనేక విధములుగా అనేక మందికి బహుళార్థ సాధముగా ఉపయోగపడును. ఇది చాలా మంచి పని. ఈ గ్రంథము ఉపయోగించు పాఠకులకు ఆకుండి నారాయణమూర్తిగారి కుటుంబమునకును, ప్రేరకులగు వారికిని పరదేవత యగు కామేశ్వరి సమస్తమైన కోరికలను ఒసగుగాక.

*మంగళం మహత్ ।*

*లోకాస్స మస్తాసుఖినోభవంతు । సర్వేజనాస్సుఖినోభవంతు ।*

*ఓం తత్సత్ ।*

సనాతన గురుకులాశ్రమ శ్రీ విద్యాపీఠం
పూల్‌బాగ్ రోడ్డు, విజయనగరం.
తేది : 8-8-2002

ఇట్లు
**యనమండ్ర వేణుగోపాల శాస్త్రి**
(శ్రియానందనాథ)

శ్రీ కామేశ్వరీదేవ్యైనమః ।

# పరిచయము

**ఆ**కుండి వారిది విస్తృత కుటుంబం. ఈ కుటుంబీకులందరు దగ్గర దగ్గరలో నుండుటచే జాతాశే చమృతాశౌచముల బాధలెక్కువగా నుండుటచే, యే శుభకార్యము తలపెట్టవలెనన్నను యిబ్బందిగా నుండెడిది. కావున వ్యావహారిక సౌలభ్యం కొఱకు ఆకుండి వారి కుటుంబము మూడు భాగములుగా విభజింపబడినది. కాని వీరందరిది ఒకే గోత్రము ఒకటే ఋషులు. కుటుంబములు విడదీయుటకు ప్రాతిపదికగా, ఆ యా కుటుంబముల వారు ఆరాధించు ఇష్టదైవములు తీసికోబడిరి. శ్రీ కామేశ్వరి దేవిని కొల్చెడివారిని కామాకుండి యనియు, వ్యాస మహర్షిని కొల్చేవారిని వ్యాసాకుండి యనియు, దుర్గాదేవిని ఆరాధించెడివారిని దుర్గాకుండి యనియు విభజించిరి. ఈ కుటుంబముల వారందరికి ఒకే ఇంటిపేరు, గోత్రము, ఋషులు యున్నప్పటికి జాతాశాచమృతాశౌచ సంబంధము మాత్రము లేదు.

పైన చెప్పిన విభాగములలో కామాకుండి విభాగమునకు చెందినవి మా కుటుంబములు, మా స్వస్థలం విజయనగరం జిల్లాలోని చౌదంతి వలస గ్రామము. మా కుటుంబాలకు చెందిన పూర్వీకులు వారి స్వస్థానమైన కోనసీమలోని కేశనకుర్రు నుండి శ్రీ కామేశ్వరీపీఠమును తెచ్చి నిల్పినట్లు తెలియుచున్నది. అంతేగాక ప్రామాణికాధారములకు దొరకని మరి కొన్ని గాథలు కూడ ప్రచారములో నున్నవి. అందులో ఒకటి ఏమనగా, మా పూర్వీకులలో నొకరు పల్లకీలో వెళ్ళుచుండగా ప్రస్తుతము చౌదంతివలసలో శ్రీ కామేశ్వరీ దేవి ఆలయమున్నచోటుకి

వచ్చుసరికి, పల్లకి బోయీలు ముందుకు కదలలేక పోయిరనియు, అందుచే పల్లకి నచ్చట దింపగా, ఆ పల్లకి లోనున్నవానికి, శ్రీ కామేశ్వరీ దేవికి ఆ స్థలములో గుడి కట్టించవలసినదిగా ఒక అ శరీరవాణి వినిపించి నట్లుగా చెప్పుదురు. తొలిగా అచ్చటనే ఆరుబయట కఱ్ఱదూలములతో ఊయల నేర్పరచిరి. కాలక్రమంలో మా కులదేవతయైన శ్రీ కామేశ్వరీ దేవికి చౌదంతివలసలో చిన్నగుడి కట్టించి మా కుటుంబముల వారు మాత్రమే శ్రీ దేవికి పూజాదికములు నిర్వర్తించుచున్నారు. మా శాఖలోని మరి కొన్ని కుటుంబీకులకు మరియు ఇతర బ్రాహ్మణ శాఖల వారికి శ్రీ కామేశ్వరీ దేవి ఆరాధ్య దేవతగా నున్నది. కాని ఎక్కడనూ శ్రీ కామేశ్వరీ దేవాలయ మున్నట్లు కానరాదు. కావున చౌదంతివలసలో వెలిసియున్న శ్రీ కామేశ్వరీదేవి కరుణకు పాత్రులైన మా జ్ఞాతి సోదరుడైన శ్రీ ఆకుండి నరసింహంగారి కుమారుడు చి॥ నారాయణమూర్తి కులదేవతను కొలుచుకొనుటకు వచ్చే భక్తుల సౌకర్యార్థం, వారు విశ్రమించుటకు, భోజనములకు, కొలువు జరుపుకొనుటకు, పూజలు చేసుకొనుటకు తగిన సౌకర్యములతో కూడిన మండపనిర్మాణము గావించిరి. కావున ఇటుపైని శ్రీ కామేశ్వరీ దేవిని కొల్చుటకు చౌదంతివలస వెళ్లేవారు, ఏ విధమైన యిబ్బంది పడనక్కరలేదు. సమస్తమైన సౌకర్యములతో కొలువు మండపము గలదు. చి॥ నారాయణమూర్తికి శ్రీ కామేశ్వరీదేవియందుగల భక్తి ప్రపత్తు లపారము. కావుననే కుగ్రామమైన చౌదంతివలసలో శ్రీ దేవి కొలువు జరుపుకొనుటకై సర్వసదుపాయములు శాశ్వతప్రాతిపదికన కలిగించుటకు తమ స్వంత ధనము నధికముగా నిష్కామ కర్మగా వెచ్చించిరి. దీనికి వారి తండ్రిగారైన శ్రీ ఆకుండి నరసింహంగారి యొక్కయు తన సోదరుడైన చి॥ కృష్ణమూర్తి, యితర కుటుంబసభ్యుల యొక్కయు సహకారము త్రికరణ శుద్ధిగా లభించినది.

ఇప్పటి వరకు 'కామేశ్వరీ పాట' అనునది మాత్రము వ్యాప్తిలో నున్నది అంతే కాని, పూజావిధాన మేదియు కానరాదు. అందువలన ఆ లోపమునుకూడ పూరించుటకు చి॥ నారాయణమూర్తి, వారి ధర్మపత్ని చి॥ సౌ॥ శకుంతల చేసిన కృషి ప్రశంసనీయము.

శ్రీదేవి వారికి వారి కుటుంబ సభ్యులకు ఆయురారోగ్యైశ్వర్యముల నిచ్చి కాపాడు గాక!

శ్రీకాకుళం ఇట్లు బుధజన విధేయుడు
22-9-2002 **ఆకుండి సూర్యనరసింహారావు**

---

### గమనిక

1. *ఈ పుస్తకములో ఏ అంశములోనైన మార్పులు, చేర్పులు వలయునని భావించిన వారు తమ భావములను సంకలన కర్తకు లిఖితపూర్వకముగా తగు ఆధారములతో తెలిపినచో తరువాతి ముద్రణలో సరిచేయ వీలుపడును.*

2. *వంశవృక్షములో చేర్చబడనివారు, తరువాతి ముద్రణలో ప్రచురించుటకు తమ వివరములు తెలుపగలరు.*



# సర్వశక్తి సంకేతం ఈ వ్రతం

**ఉ**పాస్యదేవతలను మొదలుకొని కులదేవతల వరకు గొప్ప దేవతా వ్యవస్థ మన సంస్కృతిలో భాగం. ఎవరి ఆచార సంప్రదాయాల కనుగుణంగా వారు తమ పరంపరాగత కులదేవతలను విధ్యుక్త నియమాలతో ఆరాధించాలి. కులదేవతల అనుగ్రహం చేత అభీష్టైశ్వ ర్యాలు లభించడమే కాక, అరిష్టాలు తొలుగుతాయి. కులదేవతల్ని నిర్లక్ష్యపరిస్తే ఆ దోషం చేత వేదనలు కలుగుతాయి.

అఖిండాలేశ్వరి పరాశక్తి దుర్గాది మహాదేవీ రూపాలలోనే కాక, ఇంకా అనేకానేక అంశ, కళ, కళాంశాంశ రూపాలతో ఆరాధితురాలు. అలాగే కులదేవతలుగా ఆరాధింపబడేవి కూడా ఆ దేవియొక్క అంశ శక్తులే. ఈ విషయం దేవీ భాగవతం చెబుతోంది.

అనేక విప్ర కుటుంబాలలో బహువిధ రూపాలుగా కామేశ్వరీ కులదేవతారాధన ప్రసిద్ధి. భక్తుల అభీష్ట కామనలను నెరవేర్చే ఈ తల్లి వ్రతకల్పాన్ని ఇంతటి శ్రద్ధాశక్తులతో, భక్తి ప్రపత్తులతో శ్రీ ఆకుండివారు వెలువరించడం ఆనందదాయకం.

పరాశక్తి తత్త్వంపై అవగాహన కలిగిన శ్రీ నారాయణమూర్తి దంపతులు ఎంతో శ్రమకోర్చి ఈ గ్రంథాన్ని రూపొందించారు.

ఈ రూపకల్పనయే ఒక గొప్ప వ్రతపాలన. శ్రీకామేశ్వరీ దేవత సంపూర్ణ అనుగ్రహమే వీరికి లభించే సత్ఫలం.

వ్రతకథలు, నోముల కథలు, మనకు అసంఖ్యాకంగా ఉన్నాయి. ప్రధానమైన కల్పంలో ఈ కథల్ని సమకూర్చడం సంప్రదాయం. ఈ కథలు జరిగాయా లేవా అన్న తర్క మీమాంసలు అనవసరం. ఈ కథలలో మనకు తెలియని యజ్ఞసంకేతాలు, మంత్ర యంత్ర సంకేతాలు, యోగశాస్త్ర ప్రతీకలు ఉంటాయి. వీటి పఠన శ్రవణాదుల వలన ఆ యజ్ఞఫలాలను అతి సామాన్యులకు సైతం అందజేయాలని ఆ కల్పకర్తలైన ఋషుల సంకల్పం.

ప్రస్తుత కామేశ్వరీ వ్రత కథ కూడా అటువంటి సంకేతాలతో, ప్రతీకలతో కూడినదే. బహుయజ్ఞ విశేషాలతో దీనిని అన్వయించడం కష్ట సాధ్యమే. అయినా కొంతమేరకు సంప్రదాయ భావనా పరిజ్ఞానంతో పరిశీలిస్తే కొంత అవగాహన కలగవచ్చు.

బ్రహ్మాండ పురాణంలోని లలితా కామేశ్వరీ భావనలోని కొన్ని ఛాయలు ఈ కథలో కనిపిస్తాయి.

శివుడు శూలంతో బావిని తవ్వడం, దాహంతో నున్న పార్వతి పది దోసిళ్ళు త్రాగడం, పదిగర్భాలు కలగడం, ఆ తల్లి అవయవాల నుండి బహుమూర్తులు ఆవిర్భవించడం, అందులో ఇద్దరు పురుష మూర్తులు కావడం- కథలోని ప్రధానాంశాలు.

జ్ఞానస్వరూపుడైన శివుడు తన గురుశక్తితో ఆవిష్కరించిన జ్ఞానానంద చిచ్ఛక్తియే లోతైన కొలను. అదే పాలకొలను. ఆ స్వామి శక్తికే అది అర్పితం. అలా శివశక్త్యర్పితమైన జ్ఞానం వలన సంతసించిన ఆ తల్లి (*బిందు తర్పణ సంతుష్టా...*) మనలను అనుగ్రహించడానికై తన విభూతులను వివిధ దేవతాకృతులుగా వెలువరించడమే కాక, అవన్నీ తన స్వరూపాలేననే ఏకజ్ఞానాన్ని కలిగించింది. స్త్రీ శక్తులు ఏడుగురు - సోదరులు (పురుష శక్తులు) ఇద్దరు. వీటిని యోగపరంగా భావిస్తే - సుషుమ్నలోని మూలాధారాది సహస్రారాంతం సప్త చక్రాలు, ఇడా పింగళ నాడీ స్వరూపాలు స్పష్టమౌతాయి. సహస్రారాంతరమున అమృతరసప్రవాహమే పాలకొలను. ఇది యోగసంకేతమైతే - సోమరస పానము, సప్తార్చి (అగ్నిజ్వాలలు ఏడు)జ్ఞానము, సూర్యాగ్నుల తత్త్వము యజ్ఞపరంగా సంకేతాలు. పది శృంగారరంగాలు యంత్రంలోని ఆవరణ చక్రాలు. సప్తధాతువులకీ, ప్రాణశక్తులకీ కూడా ఇవి సంకేతాలు.

ఉపాస్యదేవత అన్ని క్షేత్రాల దేవతలనీ రప్పించి క్రీడించడమే కాక, త్రిశక్తులను సాధించినట్లుగా ఉన్న కథాభాగాన్ని పరిశీలిస్తే - ఆరాధ్యయైన కామేశ్వరీ దేవతను సామాన్యగా తలచరాదనీ, ఆ తల్లి సర్వదేవతాత్మిక, సర్వశక్తిమయి అనే సత్యాన్ని భావించి ఆరాధించాలనే ఉపదేశం స్పష్టమౌతుంది.

యజ్ఞాలలో దేవతా ప్రీతికి సామగానాన్ని చేసినట్లుగానే, నోము

లలో, వ్రతాలలో పాటలు ప్రధానం. ఆ పాటరూపంలో 'సామగాన ప్రియ'కు కొలనుపాట రచింపబడింది.

'కులేశ్వరి', 'కులయోగిని', 'కులాంతస్థా' - అయిన తల్లిని 'శ్రియం వాసయ మేకులే....' అని ప్రార్థించే వైదిక విజ్ఞానమే ఈ కులదేవతారాధనలో గోచరిస్తోంది.

ఎవరి కులదేవతను వారు శ్రద్ధా భక్తులతో ఆరాధించుకొనే సంప్రదాయాన్ని మరింత పదిల పరచవలసిన బాధ్యతను నిర్వహించిన ఈ దంపతులకు అభినందన పూర్వక నమశ్శతాలు. ఈ దివ్య గ్రంథంలో నాకు ఈ విధంగా చోటు కల్పించినందుకు ధన్యవాదాలు.

హైదరాబాద్ బుధజన విధేయుడు
10-04-2006 సామవేదం షణ్ముఖశర్మ

# కృతజ్ఞతలు

**మా** కులదేవతయైన శ్రీ కామేశ్వరీదేవి, చౌదంతివలస గ్రామంలో (విజయనగరం జిల్లా) వెలసినవైనం, ఆదేవిని కొలుచుకొనే పూజాక్రమము, ఆలయచరిత్ర, ఆకుండి వంశజులు చౌదంతివలసలో స్థిరనివాస మేర్పరచుకొన్న విధము – ఇత్యాది తెలిసినవారు ఇక లేరని చెప్పవచ్చు. శ్రీ కామేశ్వరీదేవతను కొలుచుకొను విధానమునకు ఒక ప్రత్యేకత కలదు. అను వంశీయముగా కులదేవతను కొలుచుకొనే సంప్రదాయ పద్ధతి పరంపరా గతముగా సంక్రమించిన ఆచారవ్యవహారములు, పూజా క్రమము అంతరించిపోకుండా, రాబోవుతరముల వారి కందించుటకు మరియు సమకాలీనులకు మార్గదర్శిగా నుండుటకు, అక్షర బద్ధము చేయు ఆవశ్యకత యేర్పడినది.

వేద పండితులు, స్మార్త పురోహితులైన బ్రహ్మశ్రీ ముద్దు శ్రీరామ మూర్తిగారు, శ్రీ కామేశ్వరీదేవతను కొలుచుకునే సమగ్రపూజా విధాన మును కూర్చి యిచ్చిరి. కోరగానే దైవకార్యముగాను అది తన కర్తవ్యము గాను భావించి పూజా విధానమును సంతోషముతో కూర్చిన బ్రహ్మశ్రీ ముద్దుశ్రీరామమూర్తిగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు. ఈ ద్వితీయ ముద్రణలో మరికొన్ని అంశములు చేర్చి తగు సూచనలొసగి పూజా విధానమును తీర్చి దిద్దుటలో సహాయపడిన స్మార్త పురోహితులైన శ్రీ ఆకుండి చిరంజీవిరావు (వాసు) గారికి కృతజ్ఞతాభివందనములు వీరిరువురి సూచనమేరకు పూజా క్రమమునకు అనుగుణముగా నుండుటకై శ్రీ లలితాసహస్రనామములు మొదలగు స్తోత్రములు బీజాక్షర

సహిత నామావళి రూపముగ యివ్వబడి ఈ ద్వితీయ ముద్రణ పూజా భాగము రూపొందినది. చౌదంటివలస ఆకుండివారు వంశపారం పర్యముగా కుల దేవతను కొలుచుకునే పద్ధతి యీ పుస్తకములో యివ్వబడినది. మిగతా కుటుంబములలోని శ్రీకామేశ్వరీ ఆరాధకులు తమ తమ వంశాచారముననుసరించి యిందలి విషయములు గ్రహింపగలరు.

సుప్రసిద్ధ ఆయుర్వేదవైద్యులు, శ్రీదత్తకామేశ్వరీ ఉపాసకులైన బ్రహ్మశ్రీ ఆకొండి కామేశ్వరశాస్త్రి (కేశన కుర్రు తూ॥గో॥ జిల్లా) గారి అనుమతితో, వారి తాతగారైన కీ॥శే॥ ఆకొండి రామమూర్తిగారు లోగడ ప్రచురించిన 'కామేశ్వరి వ్రతకల్పము' అను పుస్తకములోని 'కామేశ్వరి వ్రతకథ', 'కామేశ్వరి అష్టకము', 'కామేశ్వరిస్తవము'లను భక్తుల ఉపయోగార్థము ఈ పుస్తకములో ప్రచురింపబడినవి. శక్తి పురాణమందలి 'శ్రీకామేశ్వరీవ్రతకథ'లో, ఆ దేవత ఆవిర్భావము, ప్రాశస్త్యం ఆరాధనా క్రమము నారద బ్రహ్మ సంవాదరూపముగా యివ్వబడినది. పూజా విధానప్రామాణికతను తెలుపుటకు, యథాతథముగా యీ పుస్తకములో చేర్చబడినవి. ఈ అంశములను యీ పుస్తకములో ప్రచురించుటకు సంతోషముతో అంగీకరించిన బ్రహ్మశ్రీ ఆకొండి కామేశ్వరశాస్త్రిగారికి కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు, వారు సతీసమేతముగా సుహృద్భావ ముతో చౌదంతివలస విచ్చేసి, యీ పుస్తక ప్రథమ ముద్రణ ఆవిష్కరణోత్స వములో పాల్గొనుట సంతోషదాయకము, కీ॥శే॥ ఆకుండి కామేశ్వరరావు గారు గతంలో అమ్మవారిపై రచించిన స్తోత్రమును వారి కుమారుల అనుమతితో దండకముగా ప్రచురించబడినది. వారికి ధన్యవాదములు.

శ్రీ కామేశ్వరీదేవత చౌదంతివలసలో వెలసిన వైనం, ఆలయ చరిత్ర ఆకుండి వంశజులు చౌదంటివలసలో స్థిరపడిన వృత్తాంతము, వారి వంశవృక్షము, ఆరామద్రావిడ శాఖవారి గోత్రనామాలు మొదలగు అంశములను బ్రహ్మశ్రీ ఆకుండి నరసింహం, బ్రహ్మశ్రీ ఆకుండి విశ్వనాథం గం॥భా॥స॥ ఆకుండి సూరమ్మగార్ల నుంచి సేకరించి, వాటిని ఒక క్రమపద్ధతిలో పరిష్కరించి, అక్షర బద్ధము చేయబడి యీ పుస్తకము మరింత విస్తృత పరచడమైనది. పై విషయములను ఓపికతో వివరించిన పెద్దల పాదపద్మములకు సాదరప్రణామములు.

ఈ పూజావిధాన ప్రథమ ముద్రణ పుస్తకమును (తేది 30-12-2002న) ఆవిష్కరించిన ఆకుండి నరసింహంగారు, ఆవేడుకలో పాలుపంచుకరున్న ఆకుండి సూర్యనరసింహారావుగారు, మరియు ఆకుండి విశ్వనాథం, ఆకుండి సూరమ్మగార్లు ఆ తరువాతి కాలములో కీర్తిశేషులైరి. కులదేవత వారి ఆత్మలకు శాంతిచేకూర్చి సద్గతులు సంప్రాప్తింపజేయు గాక. ఆకుండి నరసింహంగారి శతాబ్ది వత్సరములో (1906-2006) యీ పుస్తక ద్వితీయ ముద్రణ వెలువడుట ఒక విశేషము.

పూజ్యగురుదేవులు శ్రీ విద్యాపీఠాధిపతులైన బ్రహ్మశ్రీ యనమండ్ర వేణుగోపాలశాస్త్రి (శ్రియానందనాథ) స్వాములవారు, చౌదంతివలసతో తమకు గల అనుబంధము, శ్రీ కామేశ్వరీదేవి శక్తి విశేషములను, యీ పుస్తక ప్రథమ ముద్రణకు నుడివిన 'తొలిపలుకు'లో వివరించుటచేత అది యీ ప్రచురణలో పునః ప్రచురింపబడినది. అర్థవంతమైన 'తొలిపలుకు' ప్రసాదించిన స్వాములవారికి శిరస్సు వంచి పాదాభి వందనములు చేయుచున్నాను.

ఆకుండి సూర్యనరసింహారావుగారు (తదనంతరం కీర్తి శేషులైరి) ఆకుండి వారి కుటుంబములగురించి శ్రీ కామేశ్వరీదేవి విభూతుల గురించి ప్రస్తావించుటచే తొలిముద్రణకు వారిచ్చిన వివరణను "పరిచయము" గా యీ పుస్తకములో తిరిగి ప్రచురింపబడినది.

శ్రీ కామేశ్వరీదేవత కొలనుపాటలో బాహ్యంగా వినిపించే అర్థముకాక అనేక నిగూఢ రహస్యములు, సంకేతపదములతోను కూడి యున్నది. ఆ రహస్యార్థములను వివరించమని, శ్రీవిద్యాఉపాసకులు, 'ఋషిపీఠం' భారతీయ మానస పత్రిక వ్యవస్థాపక సంపాదకులు, ఆర్షధర్మోపన్యాసకేసరి, సమన్వయసరస్వతి, సమన్వయ సామ్రాట్ బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మగారు శివతత్త్వప్రవచన యజ్ఞ సందర్భముగా (మహాశివరాత్రి – 2006) విశాఖపట్నం విచ్చేసినపుడు, మేము అర్థించగా వారుదయతో అంగీకరించుట. ఆ సమయమునకు యీ పుస్తక (ద్వితీయ ప్రచురణ) అచ్చు ప్రతి సిద్ధముగా నుండుట, విశేషించి వారు శ్రీ లలితా ఉపాసకులగుట – అంతా అలాసమకూరుట ఆదేవి దివ్యకరుణే.

బ్రహ్మశ్రీ శర్మగారు ఋషిపీఠం మాసపత్రికలద్వారా, ఆధ్యాత్మిక ప్రసంగాలు, టి.వి., సి.డి.ల ద్వారా అందించుచున్నవారి దివ్య ప్రవచనములతో సనాతన ధర్మప్రచోదన గావించుట మనందరికి అనుభైక వేద్యము. అట్టి మహనీయులు అత్యంత పనిఒత్తిడిలో యుండికూడ ఈ పుస్తకప్రతిని పరిశీలించి శ్రీ కామేశ్వరీ కొలనుపాటలోని సంకేతపద రహస్యములను వివరించి సమన్వయపరచుట మన అదృష్టము వారి అనుగ్రహ విశేషము. సమన్వయాత్మక రహస్యార్థ వివరణను ప్రసాదించిన బ్రహ్మశ్రీ సామవేదం షణ్ముఖశర్మగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు

తెలుపుకుంటూ శిరస్సు వంచి పాదాభివందనము చేయుచున్నాను. వారి అనుగ్రహావివరణ ఈ పుస్తకములో 'సర్వశక్తి సంకేతం ఈ వ్రతం' అనే శీర్షికన ప్రచురింపబడినది. శ్రీ కామేశ్వరీదేవి పూజ జరుపుకొను భక్తు లెల్లరు యీ అర్థవంతమైన వివరణను, తత్సమన్వయమును పఠించి ఆకళింపుచేసుకొని, అమ్మవారి తత్వముపై సరియైన అవగాన పెంచుకొని తరింతురుగాక.

ఈ పుస్తక (ద్వితీయ ముద్రణ) ప్రచురణకు వలయు ఆర్థిక వనరులు భక్తియుతముగా సమర్పణ చేసిన శ్రీ ఆకుండి వెంకట రమణ మూర్తి, శ్రీ మద్దాలప్రసాదరావు, శ్రీ ఆకుండి సూర్యనారాయణమూర్తి, చి॥ ఆకుండి వెంకట కామేశ్వరరావు, చి॥ ఆకుండి రవిశంకర్, చి॥సౌ॥ ముట్లూరు లలిత పద్మజ్యోతిలకు అభినందనపూర్వక ధన్యవాదములు. ఈ పుస్తకమును సర్వాంగసుందరముగా తీర్చిదిద్ది, ఫోటోలతో సహా చక్కగా అచ్చువేసి యిచ్చిన ఎక్వేరియన్ ప్రింటింగ్ స్కూలు సోదరబృందమును అభినందించుచూ ధన్యవాదములు తెలుపుకొనుచున్నాను.

ఈ పుస్తకప్రచురణకు ప్రత్యక్షముగాను, పరోక్షముగాను సహాయ పడిన వారందరికి వారి కుటుంబ సభ్యులకు శ్రీ కామేశ్వరీదేవి ఆయురా రోగ్యైశ్వర్యములు కలుగజేసి సకల శుభములు అనుగ్రహించుగాక!

అమ్మవారి ప్రీతికై యజ్ఞార్థముగా వెలువరించిన యీ పుస్తకము భక్త జనులకు మార్గగామియగుగాక!

*సమస్త సన్మంగళాని భవంతు*

విశాఖపట్నం.

28-4-2006 **- ఆకుండి నారాయణమూర్తి**

# శ్రీ కామేశ్వరీ దేవత ఆలయ చరిత్ర

**వం**శ వృక్షములో తెలిపిన విధముగా ఐదుగురు అన్నదమ్ములు, చౌదంతివలసలో స్థిరపడిన కొంతకాలము తరువాత తమ కులదేవతయైన శ్రీ కామేశ్వరీ దేవి పీఠం తీసుకొని వచ్చినట్లు తెలియుచున్నది. రెండవతరం వారి పిల్లలలో నొకరికి చాలాకాలంవరకూ మాటలు రానట్లు, ఆ పిల్ల తండ్రికి (బహుశః సీతన్న కావచ్చు) కలలో శ్రీ కామేశ్వరీదేవి ఊయల లూగుచున్నట్లు దర్శనమిచ్చి, కుల దేవతయైన తనను వారు మరచిరనియు, తననారాధించి నచో పిల్లకు మాటలు వచ్చునని చెప్పినట్లుగా నొకగాథ ప్రతీతియై యున్నది. అంతట వారు తమ స్వస్థలమైన కేశనకుర్రు గ్రామములో వెలసియున్న శ్రీ కామేశ్వరీదేవి పీఠమును విధివిధానముగా చౌదంతివలస తీసుకొనివచ్చి, సీతన్న గారింట (కీ॥శే॥ నరసింగరావు పూర్వీకులు) స్థాపించిరి. సుమారు క్రీ.శ. 1700 సం॥ నుండి తరతరాలుగా ఆ పీఠం వారి పూజలందుకొనేది.

సీతన్నగారి కుమారులైన నరసింహులుగారు దేవి ఉపాసకులు. శ్రీ బాలా త్రిపుర సుందరిని అనునిత్యం అర్చించేవారు. వారి కుమారుడైన సత్యనారాయణ కూడా తమ యింట గల శ్రీ కామేశ్వరీదేవిపీఠంను పూజించిరి. తదనంతరము ఆ బాటనే వారి కోడలు రాయుడమ్మగారు అనుసరించిరి.

శ్రీ దేవిపీఠం తీసుకొని వచ్చిన తరువాత, ఆ అన్నదమ్ములు ఇప్పుడు గుడి ఉన్నప్రాంతములో రెండు కట్టె స్తంభాలను నిలిపి, కట్టె చెక్కపై దేవతా విగ్రహములు చెక్కించి, ఊయల నేర్పరచిరి. (ప్రస్తుతము గుడి ఉన్న చెరువు గడ్డపై పంట పొలములోనే ఊయల నేర్పరచుటకు ప్రతీతియై యున్న గాథ ప్రమాణికముగా తీసుకొనబడదు కనుక యిందులో వివరించలేదు.)

శ్రీ కామేశ్వరీ దేవత కొలువు చేసుకొనేటప్పుడు చెరువు గట్టున గల ఉయ్యాల కంబాలవద్దకు ఆ దేవత పీఠంను తీసుకొని వచ్చి పూజా కార్య

క్రమానంతరము కొలువు జరుపుచోటకు విధివిధానంగా తీసుకొని వచ్చి, కొలువు పూర్తికాగానే తిరిగి యధాస్థానములో ఉంచేవారు.

ఆరుబయట ఏర్పాటు చేయబడిన ఉయ్యాల కంబాల శీతోష్ణస్థితి గతులకు గురియగుచుకాలక్రమంలో బీటలు వారి శిధిలమయ్యేడిది. మరలా క్రొత్తగా ఉయ్యాల కంబాల నేర్పరుచుట వాతావరణ ప్రభావమున శిధిలమగుట మరల పునః నిర్మాణం జరిగెడిది.

ఈ స్థితికి స్పందించిన కీ॥శే॥ ఆకుండి సీతారామస్వామి గారు కాశీలోని తమ పదవీ విరమణానంతరము, చౌదంతివలసలో స్థిరపడిన తరువాత 1936-40 మధ్య కాలంలో ఇప్పటి గుడి కట్టించిరి. ఉయ్యాల జంపాల నేర్పరచి, ఇత్తడిరేకుపై దేవతా చిత్తరువులను విజయనగరంలో శిల్పిచే చెక్కించిరి.

చతుర్భుజములతో హంసవాహనారూఢియై యున్నట్లు శ్రీకామేశ్వరీ దేవిని మధ్యస్థముగానూ ఇరుప్రక్కలా ఆరుగురు ఆక్కలు, ఆ దేవతకు చామరము, వింజామరములు, వీచుచున్నట్లును, యిత్తడి రేకుపై చిత్రములు చెక్కించి, దానిని ఊయలలోని కర్ర చెక్కకు తాపడము చేయించి, ప్రతిష్ఠించిరి. అప్పటి వరకూ కీ॥శే॥ నరసింహరావు గారి యింట నున్న శ్రీ కామేశ్వరీ పీఠమును గుడిలోని దేవి సన్నిధికి తరిలించి ఊయలకు మలచిరి.

రెండవతరమువారైన పెదనారప్పగారి కాలంనుంచి నారికేళ యంత్రము, శ్రీ చక్రము, దేవతామూర్తులు ఇప్పటి కీ॥శే॥ పేరిశాస్త్రి గారింట ఉండేవి. వాటిని పూజామండపములో ఉంచి నిత్యపూజలలో ఆర్చించేవారు. వాటిని కూర్మన, పేరన్న, చిననారప్ప, పేరిశాస్త్రి, తర తరాలుగా పూజిస్తూ వచ్చిరి. వాటిని శ్రీ కామేశ్వరీ దేవత కొలువులో పూజించేవారు. ప్రస్తుతము ఎర్రచందన కర్రపై చెక్కబడిన సర్పాకృతి తప్ప ఆ కాలం నాటి మరియే విగ్రహాలు లేవు.

శ్రీ కామేశ్వరిదేవి గుడి నిత్యపూజలు జరుపు ఆలయం కాదు. కుల దేవతను కొలుచుకొనేటప్పుడు, శ్రీ దేవిని గుడి వద్ద అర్చించి, విధివిధానముగా ఆవాహనచేసి కొలువు మండపమున ప్రతిష్ఠించి ఆకుండివారు దంపతీ సహితముగా అర్చించెదరు.

1982 సంవత్సరములో శ్రీ ఆకుండి నరసింహమూర్తి (సింహడు) అధ్వర్యములో కొందరు దాతల విరాళ సహకారముతో గుడి ముందు చావడి కట్టించి (ఓపెన్ హాల్) నూయి త్రవ్వించి, గుడి ప్రాంగణం అభివృద్ధి పరచ బడినది.

1988 సంవత్సరములో దొంగలు గుడితాళాలు పగులకొట్టి యిత్తడి వస్తువులు దోచుకొని గుడిశిఖరమును పగులకొట్టి అపవిత్రము చేయగా, కీ॥శే॥ ఆకుండి విశ్వనాథం గారి ఆధ్వర్యములో కీ॥శే॥ ఆకుండి నరసింగరావు రాయుడమ్మ దంపతులచే 25-11-1988 తేదిని గుడికి సంప్రోక్షణ గావించబడి, మరలా త్రిశూలముతో కూడిన కలశము గుడిపై ప్రతిష్ఠ గావించబడినది.

1989 సం॥లో శ్రీ నిష్టల వెంకట సూర్యనారాయణమూర్తి, వారి బంధువు, కొల్లూరి సింహాచలంగార్లు, చావడికి (ఓపెన్ హాల్) గోడలు ఎత్తించి గదిగా మలచి, కొద్దిపాటి శ్రీ దేవి హుండి సొమ్ముతో గ్రిల్లు, ఇనుప గేటు ఏర్పాటు చేసి గుడికి భద్రత కల్పించినారు.

తే 30-9-2001 దీని శ్రీ వెంకటేశ్వర రాజుగారు గుడిముందు భాగం గచ్చు చేయించి మెట్లనేర్పరచి మార్గము సుగమము చేసిరి.

ఆకుండి వారికే గాక ఆరామ ద్రావిడశాఖలో మరికొందరి ఇండ్ల పేర్లు గలవారికి, యితర బ్రాహ్మణ శాఖల వారికి శ్రీ కామేశ్వరీ దేవి కులదేవతయై వారిచే ఆరాధింపబడుచున్నది.

# శ్రీ కామేశ్వరీ దేవత కొలువు మండపము

**చౌ**దంతివలసలో శ్రీ కామేశ్వరీ దేవతకొలువు పెట్టుకొనే గృహస్థు లెవరైనప్పటికీ ఆకుండి వారంతా ఒకే కుటుంబమువలె మెలగి అందరూ అన్ని పనులు కలిసి మెలసి చేస్తూ మహావైభవముగా జరిపించేవారు. కాల క్రమంలో తరువాతి తరం వారు ఉద్యోగ రీత్యా తరలిపోగా, వారి ఇళ్లు శిధిలావస్థకు చేరుకొని శ్రీ కామేశ్వరీ దేవత కొలువు జరిపించుట కష్టతర మగుచుండెను.

కులదేవత కొలువు నిర్వహించుటకు ప్రత్యేకించి, పరిశుభ్రమైన సువిశాల మండపము తగిన వసతులతో కల్పించాలనే సంకల్పమునకు పెద్దలు సుముఖులైరి. గుడి వద్దనే మండపము అనుకూలమని భావించి నప్పటికి అనువంశిక సంప్రదాయము ననుసరించియు, సౌలభ్యం, భద్రత అంశములను పరిగణనలోనికి తీసుకొని, నివాసస్థలములకు దగ్గరగా మండపము ఉండాలన్న పెద్దల సముచిత నిర్ణయం మేరకు స్థలాన్వేషణ సాగెను. చివరకు 1997 సం॥ అక్టోబరు నెలలో కీ॥శే॥ ఆకుండి నరసింగ రావు గారిల్లు ఆకుండి నారాయణమూర్తి క్రయం చేయుటతో మండప రూపకల్పనకు నాంది జరిగినది.

ఇక్కడ ఒక చారిత్రక విషయము ప్రస్తావించాలి. ఈ గ్రామం వలస వచ్చిన మా పూర్వీకులు సుమారు 300 సంవత్సరముల క్రితము ఈ యింటి ప్రదేశములోనే శ్రీ కామేశ్వరీ పీఠం నెలకొల్పిరి. గుడి నిర్మాణమై అందు పీఠం తరలించే వరకు కీ॥శే॥ ఆకుండి నరసింగరావుగారి పూర్వీకులు, ఆ పీఠమునకు పూజలు, నిర్వర్తించేవారు. ఇతరత్రా

స్థలాన్వేషణ జరిగినా, చివరకు శ్రీ కామేశ్వరీ దేవత పీఠం మొదట నెలకొల్పిన స్థలమే లభ్యమగుట అందే పూజా మండప నిర్మాణం జరుగుట ఆ కామేశ్వరీ దేవత అనుగ్రహ విశేషమే కదా!

1998 సం॥ తుఫానుల తాకిడికి నేలమట్టమయిన యింటి శిధిలమును తొలగించి 2000 సం॥ మార్చి నెలలో నేల చదును చేయబడినది. 19-4-2000 తేదిన ఆకుండి నారాయణమూర్తి శకుంతల దంపతిచే శంకుస్థాపన జరుపబడినది లగాయితు ఆరు నెలలో పూజా మండపము, వసతి హాలు, వాకిలి, వరండాలు, నిర్మాణమును వారు తమ ముప్పురు పిల్లల ఆర్థిక సహకారముతో పూర్తిచేసిరి. జరుగుచున్న సత్కార్యములకు స్పందించి తమంత తాముగా ముందుకు వచ్చి, భక్తి పూర్వకముగా సమర్పింపబడిన విరాళములతో మరికొన్ని సదుపాయము లకు సంబంధించిన పనులు (ఫేజ్-2) 2000 సం॥ నవంబరు నెలలో పూర్తిచేయబడినవి. ఇట్లు తమంతతాముగా ముందుకువచ్చిన వారికి అవకాశము కల్పిస్తూ భక్తియుతముగా సమర్పణ గావించిన సొమ్ముతో అభివృద్ధి జరుగుచున్నది.

కోరిన తొడనే డిజైను, అంచనాలు అందించి, నిర్మాణమును కొంత వరకు పర్యవేక్షించి తగు సూచనలు సలహాలు నొసగిన శ్రీ వర్ఝుల సత్యన్నారాయణగారు, మేస్త్రీలను కుదిర్చి కొంతవరకు నిర్మాణము పర్యవేక్షించిన శ్రీ గుమ్మా కృష్ణమూర్తిగారు, నిర్మాణ బాధ్యత వహించిన శ్రీ నిష్టల వెంకటసూర్యనారాయణమూర్తి, శ్రీమతి సూర్యకాంతం దంపతులు, కొంతమేర కలప నిచ్చి సహాయపడుటయే గాక మండపము యందు ఉపకరించు ప్రత్యేక పూజా పాత్రలు భక్తి భావముతో సమకూర్చిన

కీ॥శే॥ ఆకుండి నరసింహం, చి॥సౌ॥ లలిత పద్మజ్యోతి, చి॥ రవిశంకర్, మొదలగు వారు మరియు వంటలకు వాడుకలకు వలయు పాత్ర సామాను లన్నియూ, భక్తి యుతముగా సమర్పణ చేసిన శ్రీ ఆకుండి కృష్ణమూర్తిగార్ల నిష్కామకర్మ ఫలమే ఈనాడు మీముందున్న మండప సముదాయములు మరియు అందలి సౌకర్యములు.

నూతన మండప ప్రవేశము, శ్రీ సత్యన్నారాయణ వ్రతము, శ్రీ కామేశ్వరీ దేవత కొలువు, వరుసగా 2000 సం॥ డిసెంబరు 11, 12, 13 తేదీలలో ఆకుండి నారాయణమూర్తి, శకుంతల దంపతిచే భక్తి శ్రద్ధలతో వైభవముగా జరుపబడినవి. నిర్మాణ సారధులు నూతన వస్త్రములతో సత్కరించబడిరి. ఈ మూడు శుభదినములలో యజ్ఞార్థముగా నిర్వహించబడిన అన్నదాన, వస్త్రదాన, పూజాదిశుభకార్యముల వినియోగ మున కైవలము ధనసంపత్తి యావత్తు చి॥ ఆకుండి వెంకట కామేశ్వరరావు (నారాయణమూర్తి శకుంతల పెద్దకుమారుడు) సద్భావనతో సమకూర్చిరి.

ఫలాపేక్షనాశించక సేవాభావముతో నిర్మాణములో పాలుపంచు కున్న వారిని, భక్తిపూర్వక వస్తు ఆర్థిక సహాయ మందించిన వారిని మరియు వారి కుటుంబ సభ్యులను శ్రీ కామేశ్వరీ దేవత సకల శుభములు కలుగజేసి సదా అనుగ్రహించు గాక.

ఈ విధముగా సదాశయముతో నేర్పాటు అయిన పవిత్ర మండప ప్రాంగణ సముదాయములు, భక్తులు శ్రీ కామేశ్వరీ దేవతను భక్తి శ్రద్ధలతో కొలుచుకొనుటకు అంకితము చేయబడినది.

# శ్రీ కామేశ్వరీ దేవత కొలువు పద్ధతి

**చౌ**దంతివలసలో వెలసియున్న కులదేవత శ్రీ కామేశ్వరీదేవిని ఆకుండి వంశజులు తరతరాలుగా కొలుచుకునే విధానమునకు ఒక ప్రత్యేక పద్ధతి కలదు. వారు తమ మగపిల్లల వివాహానంతరము నవ వధూవరులతోనూ మరియు ఇతర శుభకార్యానంతరం, అనుగ్రహము కొరకు శ్రీ కామేశ్వరీ దేవత కొలువు యధావిధిగా నొనర్చుట అనువంశిక ఆచారము. ఈ వ్రతము సదాచారముతో మిక్కిలి నియమ నిష్ఠలతో చేయవలసియున్నది.

కొలువు జరుపుకునే గృహస్థులచే ఋత్విక్కులు శ్రీ సూక్తప్రకారము షోడశోపచారములతో శ్రీ కామేశ్వరీదేవి నర్చించి, ధూపదీప నైవేద్యానంతరము కొలను పాటతో పరిసమాప్తి చేయుదురు.

గృహస్థులు ప్రాతః కాలముననే లేచి స్నానమాచరించి పూజా గృహమును శుభ్రము చేసి, ముగ్గుపెట్టి మామిడి తోరణములతో నలంకరించి, పూజా ద్రవ్యములను సిద్ధము గావించుకొనెదరు. నానబెట్టిన 5 కొలత పాత్రల బియ్యమును శుచియై వచ్చిన ముత్తైదువులు మడిగా దంచి చలిమిడి తయారు చేసెదరు. వడపప్పు, పానకము కూడా సిద్ధము చేసుకొనెదరు. చెంబు నిండుగా (పాలకొలనుకై) ఆవు పాలు, యిత్తడి పళ్లెం సిద్ధముగా యుంచుకొనెదరు. పూజచేయు గృహస్థులు ఉషః కాలమున పూర్ణకలశము చేబట్టి ముత్తైదువులు, పసుపు, కుంకుమ, పూలు

కలశము చేపట్టి, ఉల్లభం క్రింద రాగా శ్రీ కామేశ్వరీ దేవత ఆలయమునకు మంగళవాద్యములతో వెళ్లి, ఆరుణోదయ సమయాన శ్రీదేవి నర్చించి, తన అక్కలైన రశికాంబిక, చీర్వాణి, పేర్వాణి, జక్కులాంబ, ఎన్నికాంబిక, ముగ్ధ, కొండ వాణికలతోను, అన్నలైన పోతన్న, వీరభద్రుడు తోనూ, ముక్కోటి దేవతలు, నందెన్న, నాగన్న, నారదుడు, అష్టదిక్పాలకుల తోనూ వచ్చి పూజా గృహమందు కొలువు దీర విచ్చేసి, మా పూజలందు కొని మమ్మాశీర్వదించ రమ్మని ఆహ్వానించెదరు. అపరాధములను క్షమింప వేడుకొనెదరు.

తిరిగి అదే విధముగా మంగళవాద్యములతో పూజా గృహమందు చేరి, శ్రీదేవి నావాహన చేసిన కలశమును, తూర్పు లేదా ఉత్తర దిశగా నేర్పరచిన అష్టదళ పద్మం ముగ్గుపై నుంచెదరు.

శ్రీ కామేశ్వరీ దేవత అక్కలుగా వ్యవహరించుటకు, ఆకుండి వారి ఆడపడుచులు ఏడుగురు, సోదరులు పోతన్న, వీరభద్రుడుగా నుండ దగిన వారిని, పేరంటాండ్రుగా ఆరుగురుముత్తైదువులను, కొలువుకు విచ్చేయవలసినదిగా, పూజ చేయించే దంపతులు, ఆహ్వానించెదరు. ఆ ఊరి బ్రాహ్మణులను పూజకు భోజనమునకు రమ్మని పిలిచెదరు.

పూజా మండప తూర్పు లేదా ఉత్తర దిశలలో శ్రీ కామేశ్వరీ దేవత శృంగారం ముగ్గు పంచరంగులలో యీ క్రింది విధముగా సిద్ధం చేసుకొనెదరు.

**శృంగారం ముగ్గుకి వలయు రంగులు :**

1. పసుపు రంగు - పసుపు గుండ
2. ఎరుపు రంగు - కుంకుమ
3. తెలుపు రంగు - బియ్యం పిండి
4. ఆకుపచ్చ రంగు - ఎండిన తంగేడు ఆకుల గుండ
5. నలుపు రంగు - కాలిన కొబ్బరి చిప్పల గుండ

**శృంగారం ముగ్గు నమూనా**




మధ్యలో అష్టదళ పద్మాలు 5, నలుపు తప్ప మిగతా 4 రంగులతో మూలకు ఒకటిచొప్పున మధ్య పద్మమునకు వాటిలో ఏదైనా రంగు వేయవచ్చును.

**అష్టదళ పద్మం**
**ముగ్గు నమునా :**



కొలువు చేసుకొను దంపతులు ముందుగా వేసుకొన్న శృంగారం ముగ్గుపై ఆవుపాలు పోసియుంచిన ఇత్తడి పళ్లెము నుంచెదరు. ఆ పాలపళ్లెంలో తమ బంగారు ఆభరణమును ముంచి పట్టుకొని సవ్యముగా త్రిప్పుచూ శ్రీ కామేశ్వరీ దేవి తన అక్కలతో ఆ పాలకొలనులో స్నానమాచ రించుచున్నట్లు భావన చేయుచూ కొలను పాట పాడెదరు.

పూజ పూర్తి అయిన తరువాత (వివాహానంతరపు కొలువు అయినచో) నూతనవధువు తన క్రొత్తకంతచీర కొంగుతో శృంగారం ముగ్గును ముందుగా కొంచెము తుడిచి, తదుపరి సరిక్రొత్త ఎర్రంచు తెల్లచీర (కొంగుమూలన ఎర్రని దారముతో విల్లు బాణం గుర్తు ముందుగా కుట్టియుంచిన దాని) తో తుడిచి ప్రోగుచేసెదరు. (మిగతా శుభకార్యా నంతర కొలువులో శృంగారము ముగ్గుతుడుచుటకు క్రొత్తచీర సరిపోవును)

శ్రీ కామేశ్వరి దేవి అక్కలుగా వ్యవహరించే ముత్తైదువలను స్వయముగా ఆ దేవత అక్కలైన రశికాంబిక, చీర్వాణి, పేర్వాణి, జక్కులాంబ, ఎన్నికాంబిక, ముగ్ధ, కొండవాణికలగానే భావన చేయుచూ వారి పాదములకు పసుపు పారాణి రాసి బొట్టు పెట్టి, పూలతో పూజించి శ్రీ కామేశ్వరీ దేవికి నివేదించిన ప్రసాదములైన చలిమిడి, వడపప్పు, పానకము, పండ్లు భక్తి శ్రద్ధలతో సమర్పించెదరు. ఆ అక్కల నుంచి కొలువు నిర్వహించు దంపతులు తమ కండువా / చీర కొంగుపట్టి,

ఒక్కొక్క అక్క నుండి వారికివ్వబడిన (చలిమిడి, వడపప్పు, పండ్లు) కొద్దికొద్దిగా ముమ్మారు దండుకొనెదరు. వాటిని శ్రీ కామేశ్వర దేవత అక్కలే స్వయముగా యిచ్చిన మహా ప్రసాదముగా భావన చేయుచు ఆ దంపతులు స్వీకరించెదరు.

వండిన వంటకములు గుడి వద్ద అమ్మవారికి మహా నైవేద్యము చేసిన పిదప, ముందుగా అక్కలకు, పేరంటాళ్లకు వడ్డించిన తరువాత వచ్చిన వారందరకూ సంతర్పణ గావించెదరు.

అక్కలు, పేరంటాళ్లు, సోదరులు పోతన్న, వీరభద్రుడు ఋత్విక్కులను తమ శక్తికొలది సత్కరించెదరు. పైన తెలిపిన విధముగా పెద్ద కొలువు చేసుకోలేనివారు **'ముంతచల్ల'**గా పిలువబడు సూక్ష్మపద్ధతి కలదు. వారి స్వగృహములోని పూజా మందిరములో కలశప్రతిష్ఠ చేసి (కలశములో మంచి నీరు పోసి గంధపుష్పాక్షతలు వేసి మామిడి కొమ్మ నుంచి దానిపై కొబ్బరి కాయ, జాకెట్టు బట్ట యుంచి) తమలపాకుపై మంచి గంధముతో శ్రీ కామేశ్వరీ దేవత ప్రతిమగా చేసి ఆవాహన చేసెదరు. శ్రీ సూక్త ప్రకారము షోడశోపచారము గావించెదరు.

ముగ్గురు ముత్తైదువులను పిలిచి, వారి నలంకరించి (పసుపు, పారాణి పాదాలకు రాసి, బొట్టు పెట్టి) పండ్లు, పూలు, తమలపాకులు, వక్కలు, చలిమిడి, వడపప్పు, పానకము యిచ్చి నమస్కరించెదరు. తమ శక్తికొలది వస్త్రం, దక్షిణలిచ్చి, భోజనములచే సంతోషపెట్టెదరు.

**అక్కలు పేరంటాళ్ల పేర్లు**

**1. చీర్వాణి, 2. పేర్వాణి, 3. రశికాంబిక, 4. మాంకాళి, 5. ముద్దరాలు, 6. కనకమ్మ, 7. పేరిందేవి, 8. జక్కులాంబ, 9. కొండవేణి, 10. ఎన్నెమ్మ, 11. రత్నమ్మ, 12. చామంతి, 13. కామమ్మ, 14. వీరభద్రుడు, 15. పోతన్న.**



# శ్రీశ్రీశ్రీ మహాకామేశ్వరి దేవత పూజా విధానము

## విఘ్నేశ్వర పూజ

**ఓ**మ్ దేవీంవాచ మజనయంత దేవాస్తాం విశ్వరూపాః పశవో వదంతి । సానో మంద్రేష మూర్జం దుహానా ధేనుర్వాగ స్మానుప సుష్టుతైతు ॥ అయం ముహూర్త స్సుముహూర్తోఽస్తు ॥

*(ఆచమనము చేయుచూ)*

ఓం కేశవాయ స్వాహా । ఓం నారాయణాయ స్వాహా । ఓం మాధవాయ స్వాహా ।

*(ఈ మూడు మంత్రములకు తీర్థముతో ఆచమనము చేయవలెను)*
*ఇటుపై ఈ క్రింది మంత్రములు చెప్పవలెను.*

ఓం గోవిందాయ నమః । విష్ణవే నమః । మధుసూదనాయ నమః । త్రివిక్రమాయ నమః । వామనాయ నమః । శ్రీధరాయ నమః । హృషీకేశాయ నమః । పద్మనాభాయ నమః । దామోదరాయ నమః । సంకర్షణాయ నమః । వాసుదేవాయ నమః । ప్రద్యుమ్నాయ నమః । అనిరుద్ధాయ నమః । పురుషోత్తమాయ నమః । అధోక్షజాయ నమః । నారసింహాయ నమః । అచ్యుతాయ నమః । జనార్దనాయ నమః । ఉపేంద్రాయ నమః । హరయే నమః । శ్రీ కృష్ణాయ నమః ॥

దైవ ప్రార్థన :

శ్లో॥ యశ్శివో నామరూపాభ్యాం యా దేవీ సర్వమంగళా ।
తయో స్సంస్మరణా త్పుంసాం సర్వతో జయమంగళమ్ ॥

లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాభవః । యేషా మిందీవరశ్యామో హృదయస్థో జనార్దనః ॥ ఆపదామపహర్తారం దాతారం సర్వసంపదాం । లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥ సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థసాధికే। శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోఽస్తుతే ॥ శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః। ఉమామహేశ్వరాభ్యాం నమః। వాణీ హిరణ్యగర్భాభ్యాం నమః । శచీపురందరాభ్యాం నమః । ఇంద్రాది అష్ట దిక్పాలక దేవతాభ్యో నమః । అరుంధతీ వసిష్ఠాభ్యాం నమః । సీతా రామాభ్యాం నమః । మాతా పితృభ్యాం నమః । సర్వేభ్యో మహాజనేభ్యో నమః ॥ అయం ముహూర్తస్సుముహూర్తోస్తు ॥

*(నీటిని పైకి, ప్రక్కలకు, వెనుకకు చల్లుచూ...)*

ఉత్తిష్ఠంతు భూత పిశాచాః । యేతే భూమి భారకాః । ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే ॥

*(ప్రాణాయామము చేయుచూ)*

ఓం భూః, ఓం భువః, ఓగ్ం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓగ్ం సత్యమ్. ఓం తత్సవితు ర్వరేణ్యం ॥ భర్గో దేవస్య ధీమహి । ధియో యో నః ప్రచోదయాత్ ॥ ఓ మాపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భు వస్సువరోమ్ ॥

(ఈ క్రింది సంకల్పము చెప్పవలెను)

మమ ఉపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వరముద్దిశ్య, శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభాభ్యాం, శుభే, శోభనే ముహూర్తే, శ్రీ మహావిష్ణో రాజ్ఞయ, ప్రవర్తమానస్య, అద్యబ్రహ్మణః, ద్వితీయ పరార్థే, శ్వేత వరాహకల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరత ఖండే, మేరోర్దక్షిణ దిగ్భాగే, శ్రీశైలస్య ... ప్రదేశే ... మధ్యదేశే, శోభనగృహే, సమస్త దేవతా బ్రాహ్మణ హరిహర చరణ సన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన, .... నామ సంవత్సరే, .... అయనే, .... ఋతౌ, .... మాసే, ..... పక్షే, ..... తిథౌ, ... వాసరే, శుభనక్షత్రే, శుభయోగే, శుభకరణే, ఏవంగుణ విశేషణ విశిష్టాయామ్, శుభతిథౌ, శ్రీమాన్ గోత్రః నామధేయః ధర్మపత్నీ సమేతః శ్రీమతః .... గోత్రస్య, ..... నామధేయస్య, ధర్మపత్నీ సమేతస్య, మమ సకుటుంబస్య క్రియమాణ కరిష్యమాణ క్రియామూల సర్వోపద్రవ శాంతర్థ్యం నానా ప్రకారేణ సంభావిత సకల మహాభయ నివృత్యర్థం, మమ శరీర వర్తమాన వర్తిష్యమాణ సమస్త పీఢాపరిహారార్థం సమస్త మంగళా వ్యాప్యర్థం సమస్తాభ్యుదయార్థంచ ధనపుత్ర వాంఛిత ఫలసిధ్యర్థం సర్వ శత్రు క్షయార్థం సర్వస్థానేషు, జయసిద్ధ్యర్థం పరక్రియ మాణ మంత్రయంత్ర తంత్రోచ్చాటన మోహన, స్థంభన వశీకరణాది మహాభయ నివృత్యర్థం సంభవిద్భిః పుష్పైః ద్రవ్యైః సంభవిద్భి రుపచారై సంభవితా నియమేన సంభవితా ప్రకారేణ శ్రీ కామేశ్వరీ దేవతా ముద్దిస్య శ్రీ కామేశ్వరి దేవతా ప్రీత్యర్థం శ్రీ సూక్త విధానేన యావచ్ఛక్తి, ధ్యానావాహ నాది షోడశోపచార పూజాం కరిష్యే॥

ఆదౌ నిర్విఘ్న పరిసమాప్త్యర్థం శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే । తదంగ కలశారాధనం కరిష్యే ॥

**కలశారాధన :**

కలశే గంధ పుష్పాక్షతై రభ్యర్చ్య ॥

*(కలశములో గంధ, పుష్ప, అక్షతలు వేసి, కలశమును కుడిచేతితో మూసి)*

కలశస్య ముఖే విష్ణుః, కంఠే రుద్ర స్సమాశ్రితః ।
మూలే తత్ర స్థితో బ్రహ్మా, మధ్యే మాతృగణా స్మృతాః ॥
కుక్షౌతు సాగరా స్సర్వే సప్తద్వీపా వసుంధరా ।
ఋగ్వేదోఽథ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః ।
అంగైశ్చ సహితా స్సర్వే కలశాంబు సమాశ్రితాః ॥

**మంత్రము :**

ఆ కలశేషుధావతి పవిత్రే పరిషిచ్యతే ఉక్థైర్యజ్ఞేషు వర్ధతే ।

ఆపోవా ఇదగ్ంం సర్వం విశ్వాభూతాన్యాపః, ప్రాణావా ఆపః, పశవ ఆపోఽన్న మాపోఽమృతమాప, స్సమ్రాడాపో, విరాడాప, స్స్వరాడాప, శ్ఛందాగ్ంసి ష్యాపో, జ్యోతీగ్ంషి ష్యాపో, యజూగ్ంష్యాప, స్సత్యమాపస్సర్వా దేవతా ఆపో, భూర్భువస్సువ రాప ఓమ్ ॥

*(ఈ క్రింది శ్లోకములు చదివి శుద్ధోదకమును దేవునిపై, తనపై, పూజా సామాగ్రిపై చల్లవలెను.)*

గంగేచ యమునే చైవ గోదావరి సరస్వతీ ।
నర్మదే సింధు కావేరి జలేఽస్మిన్ సన్నిధింకురు ।

కావేరి తుంగభద్రా చ, కృష్ణవేణ్యా చ గౌతమీ ।
భాగీరథీతి విఖ్యాతాః పంచగంగాః ప్రకీర్తితాః ॥

ఆయాన్తు మమ దురితక్షయ కారకాః । శ్రీ మహాగణాధిపతి పూజార్థం కలశోదకేన దేవం, ఆత్మానం, పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య ॥

*గణపతి ప్రాణప్రతిష్ఠాపనము :*

ఓం అసునీతే పునరస్మాసు చక్షుః
పునః ప్రాణమిహనో ధేహి భోగమ్ ।
జ్యోక్పశ్యేమ సూర్యముచ్చరం తమనుమతే మృడయాన స్వస్తి॥

అమృతం వై ప్రాణా అమృతమాపః, ప్రాణానేవ యథాస్థాన ముపహ్వాయతే । శ్రీ మహాగణాధిపతి ప్రాణప్రతిష్ఠాపన ముహూర్త స్సుముహూర్తోస్తు ॥

స్థిరోభవ, వరదోభవ, సుముఖోభవ, సుప్రసన్నోభవ, స్థిరాసనంకురు.

**ధ్యానం :** *(ఈ క్రింది మంత్రము చదువుచూ ధ్యానము చేయవలెను)*

ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే,
కవిం కవీనా ముపమశ్రవస్తమమ్ ।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆన శ్శృణ్వ న్నూతిభిస్సీద సాదనం ॥

ఓమ్ శ్రీ మహాగణాధిపతయే నమః, ధ్యాయామి.

**ఆవాహనము :** *(అక్షత లుంచుచూ)*

ఓమ్ శ్రీ మహాగణాధిపతయే నమః ఆవాహయామి । సువర్ణ రత్నఖచిత సింహాసనం సమర్పయామి ।

శ్రీ మహాగణాధిపతయే నమః । పాదయోః పాద్యం సమర్పయామి.

శ్రీ మహాగణాధిపతయే నమః । హస్తయోః అర్ఘ్యం సమర్పయామి.

శ్రీ మహాగణాధిపతయే నమః। ముఖే శుద్ధ ఆచమనీయం సమర్పయామి। స్నపయామి ।

శ్రీ మహాగణాధిపతయే నమః। పంచామృత స్నానం సమర్పయామి।

*(జలములు జల్లుచూ)*

ఓం ఆపోహిష్ఠామయో భువః తాన ఊర్జే దధాతన। మహేరణాయ చక్షసే। యోవశ్శివతమో రసః తస్య భాజయతే హనః ఉశతీరివ మాతరః తస్మా అరజ్గ మామవో యస్య క్షయాయ జిన్వథ। ఆపోజనయథాచనః ॥

శ్రీ మహా గణాధిపతయే నమః। శుద్ధోదక స్నానం సమర్పయామి॥ స్నానానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి ।

**వస్త్రము :** *(వస్త్రము వేయుచూ)*

అభి వస్త్రా సువసనా న్యృషాభి ధేనూస్సుదుఘాః పూయమానాః అభిచంద్రా భర్త వేనో హిరణ్యాభ్యశ్వాన్ । రథినో దేవసోమ ॥ శ్రీ మహా గణాధిపతయే నమః । వస్త్రయుగ్మం సమర్పయామి ॥

**యజ్ఞోపవీతము :** *(యజ్ఞోపవీతము వేయుచూ)*

యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్। ఆయుష్యమగ్ర్యం ప్రతిముఞ్చ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః ॥ శ్రీ మహా గణాధిపతయే నమః । యజ్ఞోపవీతం సమర్పయామి॥

***గంధము :*** *(గంధము నలంకరించుచూ)*

గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్ । ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్ ॥ శ్రీ మహాగణాధిపతయే నమః । దివ్య శ్రీగంధం సమర్పయామి ।

***అక్షతలతో :*** *(అక్షతలు, దూర్వము(గరిక) లతో, పూజించుచూ)*

ఆయనేతే పరాయణే దూర్వారోహన్తు పుష్పిణీః । హ్రదాశ్చ పుండరీకాణి సముద్రస్య గృహా ఇమే ॥ శ్రీ మహాగణాధిపతయే నమః । గంధ స్యోపరి అలంకరణార్థం అక్షతాన్ సమర్పయామి దూర్వాక్షతైః పూజయామి ।

***పుష్పములతో :*** *(పుష్పములతో పూజించుచూ)*

ఓం సుముఖాయ నమః । ఓం ఏకదన్తాయ నమః । ఓం కపిలాయ నమః । ఓం గజకర్ణకాయ నమః । ఓం లంబోదరాయ నమః । ఓం వికటాయ నమః । ఓం విఘ్నరాజాయ నమః । ఓం గణాధిపాయ నమః । ఓం ధూమకేతవే నమః । ఓం గణాధ్యక్షాయ నమః । ఓం ఫాలచన్ద్రాయ నమః । ఓం గజాననాయ నమః । ఓం వక్రతుండాయ నమః। ఓం శూర్పకర్ణాయ నమః। ఓం హేరంబాయ నమః। ఓం స్కంద పూర్వజాయ నమః । ఓం సర్వసిద్ధి ప్రదాయకాయ నమః ॥

శ్రీ మహాగణాధిపతయే నమః । నానావిధ పరిమళ పత్ర పుష్పాణి సమర్పయామి ॥

**ధూపమ్ :** *(అగరువత్తులు ధూపం చూపించుచూ)*

వనస్పత్యుద్భవై ర్దివ్యైర్నానాగంధైస్సు సంయుతః ।
ఆఘ్రేయస్సర్వ దేవానాం ధూపోఽయం ప్రతిగృహ్యతామ్ ॥

శ్రీ మహాగణాధిపతయే నమః । ధూప మాఘ్రాపయామి ।

**దీపం :** *(దీపము వెలిగించుచూ)*

సాజ్యం త్రివర్తి సంయుక్తం వహ్నినా యోజితం ప్రియం
గృహాణ మజ్గళం దీపం త్రైలోక్య తిమిరాపహం ।
భక్త్యాదీపం ప్రయచ్ఛామి దేవాయ పరమాత్మనే
త్రాహిమాన్నరకాద్ఘోరాః దివ్యజ్యోతిర్నమోఽస్తుతే ॥

శ్రీ మహాగణాధిపతయే నమః । దీపం దర్శయామి ।
ధూప దీపానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి ।

**నైవేద్యం :** *(నివేదన చేయుచూ)*

ఓం భూర్భువస్సువః । తత్సవితుర్వరేణ్యం । భర్గోదేవస్య ధీమహి । ధియోయోనః ప్రచోదయాత్ । సత్యంత్వర్తేన పరిషించామి। అమృతమస్తు । అమృతోపస్తరణమసి ॥ శ్రీ మహాగణాధిపతయే నమః నైవేద్యం సమర్పయామి ॥

ఓం ప్రాణాయ స్వాహా । ఓం అపానాయ స్వాహా । ఓం వ్యానాయ స్వాహా । ఓం ఉదానాయ స్వాహా । ఓం సమానాయ స్వాహా। మధ్యే మధ్యే పానీయం సమర్పయామి ॥ అమృతాపిధానమసి ।ఉత్తరాపోశనం సమర్పయామి । హస్తౌ ప్రక్షాళయామి । పాదౌ ప్రక్షాళయామి । శుద్ధాచమనీయం సమర్పయామి ॥ (పళ్లెంలో నీరు వదలిపెట్టాలి.)

**తాంబూలం :** *(తాంబూలము సమర్పించుచూ)*

పూగీ ఫలైస్సకర్పూరై ర్నాగవల్లీ దళైర్యుతం ।
ముక్తాచూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్ ॥
శ్రీ మహాగణాధిపతయే నమః । తాంబూలం సమర్పయామి ।

**నీరాజనం :** *(నీరాజనము సమర్పించుచూ)*

వేదాహ మేతమ్ పురుషం మహాంతమ్ । ఆదిత్యవర్ణం తమసస్తు పారే । సర్వాణి రూపాణి విచిత్య ధీరః । నామాని కృత్వాఽభివదన్ యదాస్తే ॥ శ్రీ మహాగణాధిపతయే నమః । ఆనంద కర్పూర నీరాజనం దర్శయామి। నీరాజనానంతరం శుద్ధ ఆచమనీయమ్ సమర్పయామి।

***మంత్ర పుష్పము :***

సుముఖశ్చైక దంతశ్చ కపిలో గజకర్ణకః । లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః । ధూమకేతు ర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః । వక్రతుండ శ్శూర్పకర్ణో హేరంబః స్కందపూర్వజః । షోడశైతాని నామాని యః పఠే చ్ఛృణుయాదపి । విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమేతథా । సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య నజాయతే ॥ శ్రీ మహాగణాధిపతయే నమః । సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి। పువ్వులు, అక్షతలు సమర్పించవలెను.

***ప్రార్థన :***

ఆయుర్దేహి యశోదేహి శ్రియం సౌఖ్యంచ దేహిమే ।
పుత్రాన్, పౌత్రాన్ ప్రపౌత్రాంశ దేహిమే గణనాయక ॥
శ్రీ మహాగణాధిపతయేనమః ప్రార్థన నమస్కారన్ సమర్పయామి.

*ప్రదక్షిణ :*

ఆత్మ ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి ।

యస్య స్మృత్యాచ నామోక్త్యా తపః పూజా క్రియాదిషు ।
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే సమర్పితమ్ ॥

మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం గణాధిప ।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే ॥

అనయా ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజాయా భగవాన్ సర్వాత్మకః । శ్రీ మహాగణాధిపతి దేవతా సుప్రీత స్సుప్రసన్నో వరదోభవతు। (అక్షతలు, నీళ్ళు పళ్ళెంలో విడువవలెను.)

ఉత్తరే శుభకర్మణి। అవిఘ్నమస్తు । ఇతి భవన్తో బ్రువంతు।

**సదస్యులు :** ఉత్తరే శుభకర్మణి । అవిఘ్నమస్తు ।
శ్రీ మహాగణపతి ప్రసాదం శిరసా గృహ్ణామి ॥

సహస్ర పరమా దేవి శతమూలాశతాంకుర సర్వగ్ం హరతుమే పాపం దూర్వాదుస్వప్న నాశనీ ॥

*ఉద్వాసన :*

యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాః । తానిధర్మాణి ప్రథమా న్యాసన్ । తేహనాకం మహిమాన స్సచంతే । యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవాః ॥ శ్రీ మహాగణాధిపతిం యథాస్థానం ఉద్వాసయామి। శోభనకాలే పునరాగమనాయచ ।

## పుణ్యాహవాచనం

యజమానః ఓం సర్వేషాం మహాజనానాం శ్రీ మహావిష్ణుస్వరూపాణాం బ్రాహ్మణానాం సర్వత్ర ఇమాన్యాసనావి

సభాసదః – సుఖాసనాని ॥

యజమానః సర్వైర్దేవేక్షణః క్రియతామ్ । సభాసదః ఓం తథా ॥

యజమానః ప్రాప్నువన్తుభవన్తః సభాసదః ప్రాప్నువామ ॥

ఓంపుణ్యాహం దీర్ఘ మాయురస్తు । (శిరస్యభిమంత్ర్య)

(యజమాని తన శిరస్సును కుడిచేతితో తాకవలెను.)

శివా ఆపస్సన్తు । (కలశేష్వభిమంత్ర్య)

(యజమాని తన కుడిచేతితో కలశములను అభిమంత్రణము చేయవలెను.)

సౌమనస్యమస్తు । (హృదయేభిమన్త్ర్య) అప ఉపస్పృశ్య ॥

(అదే విధముగా హృదయమును ముట్టుకొని ఉదకమును ముట్టుకొనవలెను.)

అక్షతంచారిష్టంచాస్తు ॥

( ఈ క్రింది మూడు మంత్రములను చెప్పి గంధపుష్పాక్షతలను కలశ మందు ఉంచవలెను.)

అర్చత ప్రార్చత ప్రియమేధాసో అర్చత ।
అర్చంతు పుత్రకా ఉతపురం నధృష్ణ్వర్చత అర్చత ప్రార్చత ॥

గన్ధ ద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్ ।
ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామి హోపహ్వయే శ్రియమ్ ॥

ఆయనేతేపరాయణే దూర్వారోహన్తు పుష్పిణీః ।
హ్రదాశ్చ పున్డరీకాణి సముద్రస్య గృహా ఇమే ॥

గన్ధాః పాన్తు । పుష్పాణి పాన్తు । సుమంగల్యంచాన్తు । శ్వశ్రేయస మన్తు । ప్రజాపతిః ప్రీయతాం శాన్తిరన్తు ॥

యంకృత్వా సర్వవేదయజ్ఞక్రియాకరణ కర్మారంభాశ్శుభాశ్శో భనాః ప్రవర్తన్తే తమ హమోజ్కారమాదిం కృత్వాభవద్భి రనుజ్ఞాత పుణ్య పుణ్యావాంచవాచయిష్యే ।

(అని యజమాని సాక్షతోదకమును విడువవలెను.)

బ్రాహ్మణాః వాచ్యతామ్ ॥

(అని బ్రాహ్మణులు పలికి పుణ్యాహమంత్రములు పఠించవలెను.)

**పుణ్యాహమన్త్రాః :**

ఓం భద్రం కర్ణేభిః శృణుయామదేవాః భద్రం పశ్యేమాక్ష భిర్య జాత్రాః స్థిరైరఙైస్తుష్టువాగ్ం సస్తనూభిః ॥ వ్యశేమదేవహితంయదా యుః ॥

ద్రవిణోదాద్రవిణసస్తు రస్య ద్రవిణోదాస్సనరస్యప్రయంసత్ । ద్రవిణోదావీరపతీ మిషన్నోద్రవిణోదా రాసతే దీర్ఘ మాయుః ॥

సవితాపశ్చాతాత్సవితా పురస్తా త్సవితోత్తరాత్తా త్సవితాధరా త్తాత్ సవితాన స్సువతుసర్వ తాతిం సవితానోరాసతాం దీర్ఘమాయుః ॥

నవోనవోభవతి జాయమానోహ్నాం కేతురుషసామేత్యగ్రే । భాగం దేవోభ్యో విదధాత్యాయన్ప్ర చన్ద్రమాస్తిరతి దీర్ఘమాయుః ॥

ఆప ఉన్దన్తుజీవసే దీర్ఘాయుత్వాయవర్చసే । యస్త్వాహృదాకీరిణా మన్యమానోఽ మర్త్యం మర్త్యోజోహవీమి । జాతవేదో యశోఅస్మా సుధేహి

ప్రజాభిరగ్నే అమృతత్వమస్యామ్ । యస్మైత్వగ్ం సుకృతే జాతవేద ఉలో కమగ్నే కృణవస్యోనమ్ । అశ్వినగ్ం సపుత్రిణం వీర వన్తం గోమన్తగ్ం రయింనశతేస్వస్తి । సన్యాసించామి యజుషా ప్రజామాయుర్ధనంచ ॥

దక్షిణ కలశమాదాయప్రాక్కల శేకించిత్కించి దుదకం నినయతి । దీర్ఘ మా యురస్తు ॥

(రెండు చేతులతోను దక్షిణ కలశనెత్తి దీర్ఘమా యురస్తు అని తూర్పు కలశ యందు కొంచెముదకముంచి సభవారితో క్రింది వాక్యోప వాక్యము లుంచ జరుపవలెను.)

(యజమానః) – (సభాసదః)

మనస్సమాధీయతామ్ । – సమాహితమనస్మః ।

ప్రసీదన్తు భవన్తుః । – ప్రసన్నాస్మ ।

(ఈ క్రింది వాక్యములను చెప్పుచు తూర్పు కలశయందు ఉదకము నుంచు చుండవలెను.)

**ఉదకనినయనమ్ :**

శాన్తిరస్తు । పుష్టిరస్తు । తుష్టిరస్తు । వృద్ధిరస్తు । అవిఘ్నమస్తు ఆయుష్య మస్తు । ఆరోగ్యమస్తు । స్వస్త్యస్తు । శివంకర్మాస్తు । కర్మసమృద్ధి రస్తు । పుత్రసమృద్ధిరస్తు । వేదసమృద్ధిరస్తు । శాస్త్రసమృద్ధిరస్తు । ధన ధాన్య సమృద్ధిరస్తు ।

ఈశాన్యాం బహిర్దేశే (ఉదకం సించేత్)

(ఈ క్రింది రెండు వాక్యములను చెప్పి దక్షణకలశలోని ఉదకమును ఈశాన్య మందు ఉంచవలెను.)

అరిష్టనిరసమస్తు । యత్పాపంతత్ప్రతిహతమస్తు । పునః ప్రాక్కలశే ఉదకంసించేత్ ॥

(మరల తూర్పు కలశయందు వెనుకటివలెనే ఉదకమునుంచు చుండవలెను.)

యచ్ఛ్రేయస్త దస్తు। శుక్రా ఙ్గారక బుధ బృహస్పతి శనైశ్చర రాహుకేతు సోమ సహిత ఆదిత్య పురోగాః సర్వేగ్రహాః ప్రియన్తామ్। తిథికరణముహూర్త జన్మనక్షత్ర దిగ్దేవతాః ప్రియన్తామ్ ॥

నైఋతి దేశే అపస్సించేత్।

(దక్షిణజలశలోని ఉదకమును క్రింది మూడు వాక్యములు చెప్పుచు నైఋతి దిశయందుంచవలెను.)

శామ్యన్తు ఘోరాణి । శామ్యన్తు పాపాని। శామ్యన్తు ఈతయః ॥

పునః ప్రథమ కలశే ఉదకం సించేత్ ॥

(మరల తూర్పు కలశలో పూర్వములోవలెనే ఉదకముంచు చుండవలెను.)

శుభాని వర్ధన్తామ్। శివాఋతవస్సన్తు। శివాఓషధయస్సన్తు।

శివావనస్ప యస్సన్తు। అహోరాత్రేశివేస్యాతామ్। ఉత్తరేశుభకర్మణ్య విఘ్నమస్తు । ఉత్తరోత్తర మహరహరభివృద్ధిరస్తు । ఉత్తరోత్తరాశ్శుభాః క్రియాస్సంపద్యన్తామ్ । అగ్నిపురోగా విశ్వేదేవాశ్చ ప్రియన్తామ్ । మహేశ్వరీపురోగామాతరః ప్రియన్తామ్ । ఇన్ద్రపురోగామరుద్గణాః ప్రియన్తామ్ । వశిష్ఠపురోగాఋషిగణాః ప్రియన్తామ్ శ్రీవిష్ణుపురోగా స్సర్వేదేవాః ప్రియన్తామ్ । ఆదిత్యపురోగాస్సర్వేగ్రహాః ప్రియన్తామ్ ఋషయచ్ఛన్దాగ్ స్యాచార్యా వేదాయజ్ఞాదక్షిణాశ్చ ప్రియన్తామ్ । బ్రహ్మాచబ్రాహ్మశ్చప్రయాన్తామ్। బ్రహ్మావిష్ణుమహేశ్వరాశ్చ ప్రియన్తామ్।

శ్రద్ధామేధే ప్రియేతామ్ । ప్రియతాం భగవన్నారాయణః । ప్రియతాం భగవాన్స్వామి మహాసేనః ప్రియతాం భగవాన్పితామహః ప్రియతాం భగవాన్ ప్రపితామహః ॥

సత్యాఏతా ఆశిషస్సన్తు పుణ్యాహకాలా వాచ్యన్తామ్ ॥

కలశం యథాస్థానం సంస్థాప్య ॥

(దక్షిణకలశను యథాస్థానము నుంచవలెను.)

ఉద్గాతేవ శకునే సామగాయసి బ్రహ్మపుత్ర ఇవసవనేషు శగ్ంససి । వృషేవవాజీ శిశుమతీ రపీత్యా సర్వతో నశ్శకునేభద్రమావద విశ్వతో నశ్శకునేపుణ్యమావద ॥

యాజ్యయా యజతి ప్రత్తిర్వైయాజ్యా పుణ్యేవలక్ష్మీపుణ్యామేవ తల్లక్ష్మీం సమ్భావయతి । పుణ్యాం లక్ష్మీం సంస్కురుతే ॥

యత్పుణ్యం నక్షత్రమ్ । తద్బట్కుర్వీతోపవ్యుషమ్ । యదా వైసూర్య ఉదేతి । అథనక్షత్రంనైతి । యావతి తత్రే సూర్యోగచ్ఛేత్ । యత్రజఘన్యం పశ్యేత్ । తావతి కుర్వీత యత్కార్‌స్యాత్ । పుణ్యాహ ఏవకురుతే ॥

ఓం తానివా ఏతాని యమనక్షత్రాణి । యాన్యేవదేవ నక్షత్రాణి తేషుకుర్వీతయత్కారీస్యాత్ । పుణ్యాహ ఏవకురుతే ॥

(యజమానుడు క్రింది వాక్యము పలుకవలెను.)

యజమానః – ఓంపుణ్యాహం భవన్తోబ్రువన్తు ॥

(సభవారు క్రింది వాక్యములు పలుకవలెను.)

బ్రాహ్మణాః 2 – ఓం పుణ్యాహమ్

పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మదళాయతాక్షి।
విశ్వప్రియే విష్ణుమనోనుకూలే త్వత్పాదపద్మం మయి సన్నిధత్స్వ ॥ 10

యాసా పద్మాసనస్థా విపులకటితటీ పద్మపత్రాయతాక్షీ ।
గంభీరావర్త నాభిస్తనభరణమితా శుభ్ర వస్త్రోత్తరీయా ॥ 11

లక్ష్మీర్దివ్యై ర్గజేంద్రైర్మణిగణఖచితై స్స్నాపితాహేమకుంభై ।
ర్నిత్యం సాపద్మహస్తా మమ వసతుగృహే సర్వమాంగళ్యయుక్తా ॥ 12

లక్ష్మీం క్షీరసముద్రరాజ తనయాం శ్రీరంగ ధామేశ్వరీమ్ ।
దాసీభూత సమస్త దేవవనితాం లోకైక దీపాంకురాం ।
శ్రీమన్మంద కటాక్షలబ్ధ విభవద్బ్రహ్మేంద్ర గంగాధరామ్ ।
త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందే ముకుందప్రియామ్ ॥ 13

శుద్ధలక్ష్మీ ర్మోక్షలక్ష్మీ ర్జయలక్ష్మీ స్సరస్వతీ ।
శ్రీర్లక్ష్మీ ర్వరలక్ష్మీశ్చ ప్రసన్నామమ సర్వదా ॥ 14

వరాంకుశౌ పాశమభీతి ముద్రాం కరైర్వహంతీం కమలాసనస్థామ్।
బాలార్కకోటి ప్రతిభాం త్రినేత్రాం భజేహమంబాం జగదీశ్వరీంతామ్ ॥ 15

సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థ సాధికే ।
శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోస్తుతే ॥ 16

మహాదేవ్యైచ విద్మహే విష్ణు పత్న్యైచ ధీమహి ।
తన్నో లక్ష్మీ ప్రచోదయాత్ ॥ 17

కాత్యాయనాయ విద్మహే । కన్యకుమారి ధీమహి ।
తన్నో దుర్గిః ప్రచోదయాత్ ॥ 18

కామేశ్వరీం మహాదేవీం మహాలక్ష్మీం సరస్వతీం త్రిశక్తిరూపిణీం మాతా ముమాంచండీందుర్గాం నమామ్యహమ్ ॥

శ్రీమహాకామేశ్వరీ దేవతాయై నమః - సువర్ణదివ్య మంత్రపుష్పాన్ సమర్పయామి.

(పువ్వులు దేవిపై వేయవలెను)

పరిపూర్ణార్పణం :

శ్రీ కామేశ్వరీదేవ్యై నమః - ఆత్మ ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి ॥ (ప్రదక్షిణ చేయవలెను)

యానికాని చపాపాని । జన్మాంతర కృతానిచ ।
తానితానిప్రణస్యంతి । ప్రదక్షిణపదేపదే ॥

పాపోఽహం పాపకర్మాహం పాపాత్మాపాపసంభవః
త్రాహిమాం కృపయాదేవి శరణాగతవత్సల ।
అన్యధాశరణం నాస్తి త్వమేవశరణం మమ
తస్మాత్కారుణ్యాభావేన రక్షరక్షమహేశ్వరి ॥

ఛత్ర చామర గీత నృత్య ఆందోళికా అశ్వారోహణ గజారోహణ సమస్త రాజోపచార దేవోపచారన్ మనసా సమర్పయామి ।

మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వరీ ।
యత్పూజితం మయాదేవి పరిపూర్ణం తదస్తుతే ॥

(అక్షింతలు, నీళ్ళు తీసుకొని) అనయా ధ్యానావాహనాది షోడశోపచార

పూజయా భగవతీ సర్వాత్మికా శ్రీమహాకామేశ్వరీ దేవతా సుప్రీతో సుప్రసన్నో వరదో భవతు ॥ (*ఈ మంత్రం చదువుతూ అక్షతలు, నీటిని కుడి చేతితో వదలిపెట్టవలెను.*)

శ్రీ కామేశ్వరీదేవతా ప్రసాదం శిరసాగృహ్ణామి ॥

శ్రీ కామేశ్వరీదేవతా ప్రసాద సిద్ధిరస్తు ॥

*ఓం తత్ సత్ । ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥*

*ఈ పుస్తక ద్వితీయ ముద్రణకు వలయు ఆర్థిక సహకారమును భక్తియుతముగా సమర్పణ చేసినవారు*

**శ్రీ ఆకుండి వెంకటరమణమూర్తి - శ్రీమతి సుమతి**

**చి॥ ఆకుండి వెంకట కామేశ్వరరావు**

**చి॥సౌ॥ ముట్లూరు లలిత పద్మజ్యోతి**

**చి॥ ఆకుండి రవిశంకర్.**

**శ్రీమద్దాల ప్రసాదరావు - శ్రీమతి వర్ధనమ్మ**

**శ్రీ ఆకుండి సూర్యనారాయణమూర్తి**

# శ్రీ కామేశ్వరీ దేవత కొలనుపాట

శివశివాదేవరా శివనందినెక్కి । కదిలెనే కైలాసపర్వతమ్ములకు భారత శ్రీలక్ష్మీ పార్వతుల గొలచి । పుణ్యతీర్థములాది పొలుపొందు గాను । పుణ్యమునులకునే పొందుగా మ్రొక్కి । పురుషోత్తమునియందు బుద్ధి నేనుంచి । పుణ్యమై యింపొందు పుడమిలోపలను । కామేశ్వరి కల్పమ్ము ఘనముగా జెప్పు ॥ * మనమాడుపాలకొలను మనమాడి పాడంగా మనకామూ వెలసే మాడుపాలకొలను ॥ శుకపికశారి కానక పంక్తితోను। లేచి గంతులవైచు లేళ్ళగమితోను । మల్లిచా మంతుల మొల్లాలతోను । వెల్లివిరసియున్న విరజాజులతోను । నల్లిబిల్లీ గొన్న ద్రాక్షలతోను యుల్లాసమైనట్టి యుయ్యాలలతోను । అరటి తోటల తోను పెనవేసుకున్న గండపుతీవులా పొదరిళ్ళతోను । కలహంస లున్నట్టి కొలనులతోను ॥ పొలుపొందు పర్ణశాలలపం క్తితోను । వలనొప్పు కాషాయవస్త్రములతోను॥ చెలగుచుండెడు వేదమంత్రముల తోను । నీల కృష్ణాంజన విభవములతోను। ఆజ్యధారలు గల్గుయజ్ఞాల తోను । పూజ్యులై పెంపొందు మునులతోను । చెలగుచుండెడి నైమిశారణ్యమందు ॥ మనమాడుపాలకొలను మనమాడి పాడంగా మనకామూ వెలసే మన మాడుపాలకొలను ॥*

ఈకరణిగను నైమిశారణ్య మందు కపిల భార్గవ కణ్వగౌతమ వశిష్ఠ అత్రి భద్రకర్ణాట బాహుళ్యా బాహ్లికాషాసురాట శాండిల్య భృగు గాత్రిమాండవ్య మంతా। కౌండిన్య కాపాలగాణపత్యాలు ॥ మనమాడు...॥

---

* కొలనుపాటను ఒకరు పాడగా, ఈ చరణము వచ్చిన ప్రతిసారి పూజ చేయువారు పాడెదరు.

అతికౌతుకముతో సూతుని లోకవిఖ్యాతునిగాంచి అడిగిరి మునులెల్ల ఆనందముగను । వ్రతములలోను సువ్రతమగుచు చాల। ధనకనకవస్తువాహన శుభములను । ధాన్యాది బహువస్తు సంతానము లను । గలుగజేసే పుణ్యకథ యెద్దియనిన । కలికల్మషం బెల్లగరిగి పోవగను। జెప్పుమన్నను సూతు డప్పుడుబలికె । ॥ మనమాడు...॥

వినుడి యోమునులారా వీనులలరగను । వినుతికెక్కేటట్టు విస్తార ముగను । సర్వజనులకునెల్ల సౌఖ్యంబుగాను । పూర్వయుగము నందు పూజితంబయిన । పార్వతీ కథలెల్ల బ్రణతి కెక్కగను । బ్రహ్మ నారదుల సంవాదమేగలదు । బ్రహ్మలకు హితమైన హితవాస మొకటి ॥ మనమాడు...॥

నిగతమయి వెలుగొందు సత్యలోకమున । ముత్యాల గద్దియును ముదముతో నుండి । వాణితో పలుమాఱు వాక్రుచ్చు చుండె । మును లెల్లఱును మిగుల వినయమున బొగడ సనకాదు లెల్లరూ సన్నుతింపగను। వారికథను నాకు వర్ణింపుమనిన । ॥ మనమాడు...॥

నారదుని విద్యావిశారదుడుగాంచి । పరమరహస్యమైబరగు నీ కథయు, విరివిగాజెప్పెద విను మనిపలికె బ్రహ్మ । ॥ మనమాడు...॥

దెలియగా దేవరా శివనందినెక్కి। దేవమార్గము బట్టి దివ్య మైనట్టి। దివ్యమై పెంపొందు రత్నములతోను । దివ్యమైన యక్షకిన్నరుల విమానములతోను । నక్షత్ర పర్యంత శిఖరములతోను । పక్షుల కిలకిలారావములతోను । నాగకన్యల యొక్క నాట్యములతోను। సొగసైన సురపొన్న పంక్తులతోను । బెదరి పారు లేళ్ళకదుపులతోను। సుదతుల శోభనగుణములతోను। మురియుచుతిరిగే దివ్యమునులతోను। నెమళ్ళతోను మామిళ్ళతోను । రామనామముబల్కు రాచిల్కతోను ।

చంపకాశోక పున్నాగములతోను। నిండిన నవరత్న రాశులతోను । విలసిల్లు విరజాజి మొగ్గలతోను । లలిమీరు తామరకొలనులతోను । నిర్మాలిన్యమయి నట్టి హర్మ్యముల తోను । భర్మనిర్మితమైన బాణములతోను । వేదాంతములు బల్కు విద్వాంసులతోను ॥ బాగులాడెడి సూరివర్గములతోను । కూడియున్న కులాచలములయినట్టి । కైలాస పర్వతమ్ములకు కదిలిరి ॥ మనమాడు...॥

అంతటా కైలాసగిరి పైకినేగి । హర్మ్యమధ్యమునందు యనువొప్ప గాను । తామరల వాసనల తోగూడి । వాక్రుచ్చుకలహంస వితతితో గూడ । వీకరత్నాలతో విలసిల్లుచున్న ॥ రాకేందుముఖులతో రంజిల్లుచున్న। మల్లెలతో గూడ మండపమ్ములకు । మహదేవు శివునితో మరివేగవచ్చి ప్రమదాదులును ముట్టి ప్రార్థింపుచుండ । వర దుందుభులును వాయింపు చునుండ । రంభ యూర్వశి నాట్య మాడుచు నుండ । జంభారి స్తోత్రములు సలుపుచునుండ । జయజయ ధ్వనులతో చెలగుచునుండ । రయమున వింజామరలు వీచుచు నుండ ॥ ॥ మనమాడు...॥

అంతట దేవికి దాహములాయె । తనచేతిశూలాన త్రవ్వించె కొలను పాతాళగంగను పైకిరావించె ॥ ॥ మనమాడు...॥

ముత్యంపుకొలనాయె శ్రీపర్వతాన ముత్యంపుచాయలదె కొలను యుదకమ్ము । వజ్రంపుకొలనాయె శ్రీపర్వతాన । వజ్రంపు చాయలదె కొలను యుదకమ్ము। కస్తూరికొలనాయె శ్రీ పర్వతాన। కస్తూరిచాయలదె కొలను యుదకమ్ము । నీలంపు కొలనాయె శ్రీ పర్వతాన । నీలంపుచా యలదె కొలనుయుదకమ్ము । పగడంపుకొలనాయె శ్రీ పర్వతాన । పగడంపుచాయలదె కొలను యుదకమ్ము। రత్నాలకొలనాయె శ్రీ పర్వతాన। రత్నంపుచాయలదె కొలను యుదకమ్ము । గంధంపుకొలనాయె। శ్రీపర్వతాన।గంధంపు చాయలదె కొలనుయుదకమ్ము ॥ మనమాడు...॥

ముంచి ఆరగించె మూడుదోసిళ్ళు । ముంచకారగించె మూడు దోసిళ్ళు । యెంచియారగించె యేడుదోసిళ్ళు । యెంచకారగించె నేడు దోసిళ్ళు । యేడునూ మూడునూ పది గర్భంబులాయె । ఒక్కొక్క గర్భము తొమ్మిది ఘడియలు ॥ ॥ మనమాడు...॥

అతివాకూ గర్భిణీ లధికమ్మూలాయే । అంతలోనగవరమ్మా వేల్పూలానడిగే । చిత్రించి తనునడుగా శ్రీదేవి అపుడూ ఎరుకతయై తాచెప్పే యెలమీతో ఎరుకా । సిరిలచ్చిమీయిళ్ళా చేరనున్నాదీ సింగారా ముగ్గాలూ కోరుతున్నాది । మాలచ్చి మీ యిళ్ళా మసలానున్నాదీ । మాణిక్యాముల ముగ్గాకోరూతున్నాదీ । శివలక్ష్మి మీ యిళ్ళా వెలియానున్నాది చిత్రంపూ ముగ్గాలూ కోరూతున్నాదీ– ఆదిలక్ష్మి మీ యిళ్ళానాట్యమాడ నున్నాది– అక్కాలేడ్గురు తోడా నాడానున్నాది– కామమ్మ మీయిళ్ళా కలుగా నున్నాదీ– కడతమ్మూ లిద్దరితో కలసీ వర్ధిల్లూ ॥

॥ మనమాడు...॥

పాదాల పుట్టిందె రశికాంబ తాను, రశికాంబ తాగోరె రత్నంపు కొలను। చిరితొడల బుట్టిందె చీర్వాణి తాను । చీర్వాణి తా గోరు చిత్రంపు కొలను । పెందొడల బుట్టిందె పేర్వేణి తాను । పేర్వేణితాగోరె పెద్ద రంగమ్మ । వీపునను బుట్టెను వీర భద్రుడుతాను । వీరభద్రుడుతా గోరె వింజామరాలు । ముక్కూనబుట్టిందె ముద్దరాలుతాను । ముద్దరాలు తాగోరె ముత్యంపుకొలనూ । బొడ్డుననుపుట్టిందె పోతన్నయును। పోతన్న తాగోరు బొడ్డుమల్లెల్లు । జంఘూన బుట్టిందె జక్కులమ్మతాను। జక్కులమ్మతాగోరె సన్నావళి పెమ్మ । కొప్పూన బుట్టిందె కొండవేణి తాను । కొండవేణి తాగోరె గొప్పైనాకొలనూ । వెన్నునబుట్టిందె యన్నెమ్మ తాను । యన్నెమ్మతా

గోరె యర్ర బాణమ్ము ॥ కన్నులను బుట్టింది కలికికామమ్మ । కామమ్మ తాగోరె కనకాంబరాలు ॥ ॥ మనమాడు...॥

మునుపూ మూడోనాడు మునిర్ఘామురాత్రీ పుట్టుతూ అక్కల్లు తేజస్విలైరి । పుట్టుతూ అక్కల్లు సొమ్ము లడిగేరూ । దేవియుదేవరా సొమ్మ్మాలిచ్చేరూ తమకూ జన్మించినానలినాక్షులారా మీకైనా కొదవేమి మేముండగానూ ॥ ॥ మనమాడు...॥

ఏడుగు రక్కలు ఆరుగురు చెల్లెళ్ళు । యెంతో మోహముతోను తమ్ములిద్దరును ప్రేమతో నానాట పెరుగుచునుండ । కామమ్మ అందరిలో కలికి తా మెరసి ॥ ॥ మనమాడు...॥

వనము కోవెలగూసె వాసంత మొదవె । వలరాచక్కల్లూ కొలనూ కొచ్చేరూ। శ్రీ లక్ష్మి అక్కలు శృంగారవతులు । శ్రీపురవట్నానికి వచ్చి రందరును ॥ ॥ మనమాడు...॥

కొలవవలె కామేశ్వరిని కొలనేర్పరించి । పెట్టవలె చిత్రపుచిరి పట్టుచీరె – మనము గొల్చుదాము మహిమవెలయగను । ముందు గొలుచుదాము ముదమొప్పగాను । అనిపల్కి సఖులతో కైలాసగిరికి। మును తూర్పు భాగమున నిర్మించె బ్రహ్మ । అరుదయినవారికి అమృతంపు కొలను । ఆ కోణమధ్యమున అమరున్న కొలను ॥ వెండి యుయ్యాలలతో వెలసిన్న కొలను ॥ భమిడియుయ్యాలలతో ప్రబలు కొన్న కొలను । రత్నాలయుయ్యాలలతో రంజిల్లు కొలను ॥ పచ్చ లుయ్యాలలతో ప్రభలున్న కొలను ॥ వజ్రాల ఉయ్యాలతో వనరైన కొలను ॥ ॥ మనమాడు...॥

అరటినీడలదాక అమరించె కొలను । దబ్బ నీడలదాక దాపించె కొలను । ఇప్ప నీడలదాక యిమిడించె కొలను । వటపత్రములదాక

దాపించెకొలను। చిలుకలుచెలరేగి ఆడేటీకొలను। హంసలు ప్రతినడకలు నడిచిందె కొలను । తుమ్మెదఝుంకారాలు మ్రోసిన కొలను । రత్నాల తాబేళ్ళు రాజిల్లుకొలను ॥ మంచిముత్యములతో మహినొప్పు కొలను। చక్రవాకములతో చెన్నొందుకొలను। నాచుగుల్లలతో నాణే మయినకొలను। నీటి వాయసములు నిండున్న కొలను। కలువపువ్వులు నిండ గలిగున్న కొలను । తామర పువ్వులతో తరుచైన కొలను ॥ ॥ మనమాడు...॥

అంచు నిర్మలమైనా ఆ బ్రహ్మకొలనూ, అక్కల్లూ కొలనాడా పిలువావచ్చేరూ, దేవీయూదేవారా కొలనాడారమ్మీ, శ్రీదేవీభూదేవీ కొలనాడారమ్మీ, నందీశా నారదుడా కొలనాడారమ్మీ , భృంగీశా విఘ్నేశా కొలనాడారమ్మీ, ఆ సూర్యభగవాన్లూ కొలనాడారమ్మీ, వాణీశా కోణీశా కొలనాడారమ్మీ, వలరాచా అక్కల్లు కొలనాడా రమ్మీ, వీరన్నా, పోతన్నా కొలనాడారమ్మీ, గోవర్ధనపర్వతమూ గొడుగూగాబట్టిన గోపాలాకృష్ణుడా కొలనాడారమ్మీ, శ్రీరామా లక్ష్మణులూ కొలనాడారమ్మీ సీతామహాదేవీ కొలనాడా రమ్మీ ॥ ॥ మనమాడు...॥

నిమ్మల్లా నీళ్ళల్లా నిలచిందీకొలనూ, దబ్బల్లా నీళ్ళలా దనిసిందీ కొలనూ, వెలగల్లా నీళ్ళల్లా వెలసిందీకొలనూ, చందనా వృక్షములా చల్లనిదీకొలనూ। పన్నెండూకాల్వాలా బారిందీకొలనూ, వటవృక్షములా చుట్టూ వరలిందీ కొలనూ, నీలెంచూ కొలనమ్మా పాలెంచూ కొలనూ, అక్కారోయీ కొలనూ యెప్పెట్టేడమ్మా, ముత్తెంపూ యీ కొలనూ మునికావానమ్మూ, వజ్రంపూ ఈ కొలనూ వట్రూవా యిసుకా, శ్రీ గంధామీ కొలనూ చక్కంగాజేసీ, పన్నీటా ఈకొలనూ పట్రూవాయిసుకా, పన్నీటీ ఈ కొలనూ పచ్చంగా జేసి, ఆ పూదోటలతోటీ అమరిందీ

కొలనూ, పోకా బోదెలతోటి పొసగిందీ కొలనూ, అందమైనా పువ్వూల్లా అలరారుకొలనూ ॥ ॥ మనమాడు...॥

ఊరూపేరేమన్నా శ్రీ గంధీపురమూ, చెరువూ పేరేమన్నా కలువల్లా చెరువూ, గట్టూ పేరేమన్నా ముత్యాలగట్టూ, తూము పేరేమన్న బంగారు తూమూ, రాళ్లాపేరేమన్నా వజ్రంపురాళ్లూ, ఇసుకా పేరేమన్నా వజ్రువా ఇసుకా, నీళ్లాపేరేమన్నా కనకోదాకాలూ, శ్రీ గంధామీ కొలనూ చక్కన్నీ నింపి, పొగడరమ్మా యీ కొలనూ పచ్చన్నీధాతూ, ముత్యంపూ యీకొలనూ మోహంపు ధాతూ మనమాడు యీ కొలనూ మనసూరంజిల్లా ॥ ॥ మనమాడు...॥

కామమ్మా తమ్మూలూ ఘడియల్లూ పుచ్చా గ్రక్కూన వత్తూరే అక్కల తిశ్రీఘ్రుం, వాల్కొమ్మాచెట్టెక్కీ వరహోరికామూ అందరినీ కొలనాడతా పిలవాపంపే । చిట్టిచిట్టిముత్యాల కుంచచేబట్టి । చిరివేణి కొలనాడ వేంచాయరమ్మ । పెద పెద్దముత్యాల కుంచచేబట్టి । పేర్వేణి కొలనాడ వేంచాయరమ్మ । అనేకముత్యాల కుంచచేపట్టి । అనకమ్మ కొలనాడ వేంచాయరమ్మ । మరకతముత్యాల కుంచచేబట్టి । మాంకాళికొలనాడ వేంచాయరమ్మ । ముద మొప్ప ముత్యాలకుంచచేబట్టి । ముద్దరాలు కొలనాడ వేంచాయ రమ్మ । కనకంపుకుంచయు కరమందుబట్టి । కనకమ్మకొలనాడ వేంచాయరమ్మ । జాజిమొగ్గలకుంచ చేతనేబట్టి । జక్కులమ్మకొలనాడ వేంచాయరమ్మ ॥ ॥ మనమాడు...॥

కోరి పగడపుకుంచ చేతనేబట్టి । కందువేణి కొలనాడ వేంచాయరమ్మ । ఎరుపుధాతువుకుంచె చేతనే బట్టి । ఎన్నెమ్మ కొలనాడ వేంచాయరమ్మ । రత్నాలుదాపిన కుంచచేబట్టి । రత్మమ్మకొలనాడ

వేంచాయరమ్మ । చారేడుముత్యాల కుంచచేబట్టి । చామంతికొలనాడ వేంచాయరమ్మ। ఘనమైన ముత్యాలూ కుంచాచేపట్టి, కామమ్మాకొలనాడా వేంచాయరారే। పొట్టిసరి ముత్యాలూ కుంచాచే బట్టిపోతన్నా కొలనాడా వేంచాయరారే। విస్తారం ముత్యాలూ కుంచా చేబట్టీ, వీరన్నా కొలనాడా వేంచెయ్యారారే ॥ ॥ మనమాడు ॥

ముద్దాపసుపులొప్ప చేతనేబట్టి। ముత్తైదుకొలనాడ వేంచాయరమ్మ। కొట్టుపసుపు లొప్ప చేతనే బట్టి । అక్కల్లు కొలనాడ వేంచాయరమ్మ । ముక్కోటి దేవతలు కొలనాడరండీ। మునియోగు లందరు కొలనాడరండీ । నందెన్న నారదుడ కొలనాడరమ్మా। నాతు లందరుగూడ కొలనాడరండి। వీరింటి పేరంటాళ్ళు కొలనాడరండి। వీరింటికామమ్మ కొలనాడరమ్మా ॥ ॥ మనమాడు...॥

భూలోకంబున గల్గూ పుణ్యంపూ నదులూ కొలనాడా వచ్చీరే కోటానా కోట్లూ- పాతాళమున గల్గూ పావనపూ నదులూ కొలనాడవచ్చీరే కోటానాకోట్లూ- స్వర్గామందునగల్గూ సరిలేనీ నదులూకొలనాడ వచ్చారె కోటానకోట్లూ- సత్యాలోకమ్మున సరిలేని నదులూ కొలనాడ వచ్చీరే కోటానుకోట్లూ- వైకుంతాపురము నా వెలసే దివ్యామైన నదులూ కొలనాడా వచ్చీరే కోటాను కోట్లూ- బ్రహ్మాండ భాండమ్మునా ప్రబలీనా నదులూ కొలనాడా వచ్చీరే కోటాను కోట్లూ ॥ ॥ మనమాడు...॥

కొట్టుపసుపుచేత కుంకుమచేత। వెళ్ళిరే అక్కలు కొలను ఆడంగా। కొలనాడ అక్కల్లు కొలనువిడనాడి । కట్టుకొన్న చీరలు గట్టునాబెట్టి ఒకవంక కన్నెల్లు వోలలాడేరు ॥ ॥ మనమాడు...॥

అందరు అక్కలలో వెలిగేతమ్ముడు। పోతన్న తావచ్చి ఆఘడియ లోనె। ఘంటాలాఘడియలు ఘల్లునావేసె। ముత్యాల ఘడియ ముదముతో వేసె । కెంపులఘడియ కుదురుగావేసె । పచ్చలా ఆఘడియ పరగునా వేసె ॥ ॥ మనమాడు...॥

చాకలి మడతలు చక్కంగపర్చి। యేడుగురు అక్కలును కొలనాడ బెట్టె । పాదాల చక్కగా పసుపుల్లురాసి । పరిమళ కుంకమ్ము పారాణి బెట్టి ॥ ॥ మనమాడు...॥

కొలనాడీ అక్కల్లూ ఏమి కోరేరూ ఏటేట పెళ్ళిళ్ళూ కలుగా కోరేరూ– కొలనాడీ అక్కల్లూ ఏమీ కోరేరూ, కొడుకూలూ కూతుళ్లూ కలుగాకోరేరూ; కొలనాడీ అక్కల్లూ ఏమి కోరేరూ– దినదినమూ శుభమూలూ కలుగా కోరేరూ, కొలనాడీ అకల్లూ ఏమి కోరేరూ– ఏడేటరంగములూ కలుగాకోరేరు– కొలనాడీ అక్కల్లూ ఏమి కోరేరూ– చలిమిడీ వడప్పూ కలుగాకోరేరు– కొలనాడీ అక్కల్లూ ఏమి కోరేరూ– పళ్లూ పానకమ్ములూ కలుగాకోరేరు– కొలనాడీ అక్కల్లూ ఏమి కోరేరూ– చీరల్లూ రవికాలూ యివ్వాకోరేరు– కొలనాడీ అక్కల్లూ ఏమికోరేరూ – దక్షిణాతాంబూ లంబివ్వ కోరేరు– కొలనాడీ అక్కల్లూ ఏమి కోరేరూ– పసుపు కుంకుమ కలుగాకోరేరు ॥ ॥ మనమాడు...॥

వారింట అక్కలు యేమి కోరేరు । చలిమిడి వడపప్పు చాల కోరేరు । బంగారుకలశాలకు పరిమళమద్ది । బంగారుకలశాలకు ముత్యాలనద్ది। బంగారుకడవలో పానకంబోసి। పట్టుచీరదెచ్చి పైనొప్ప గప్పి। తమలపాకులమీద కామమ్మ నుంచి। మల్లియపువ్వు, రెల్లా పువ్వులు, తంగేడు పువ్వులాతోను యీకామును పూజింత్రు । మహిసాక్షి గుగ్గిల ధూపమ్మువేసి ॥ ॥ మనమాడు...॥

బంగారు పళ్ళెములో పాలు నెయ్యిబోసి । బంగారుకడియమ్ము పాలలో వేసి । వారింట అక్కల్లుకొలనాడారండీ । వారింట పేరంటాళ్ళు కొలనాడారండీ । వారింట దేవతలు కొలనాడారండీ । వారింటా కామమ్మ కొలనాడరమ్మా ॥ ॥ మనమాడు...॥

## స్తానకాలు

గంగాపూస్తానకాననెలకొన్నట్టి విశాలాక్షీ కాముకొలనాడరమ్మీ ।
గయాపూస్తానకాననెలకొన్నట్టి మాంగల్యగౌరీ కాముకొలనాడరమ్మీ।
ప్రయాగాస్తానకాననెలకొన్నట్టి మాధవేశీకాముకొలనాడరమ్మీ ।
కాంచీపురాస్తానకాననెలకొన్నట్టి కామాక్షీకాముకొలనాడరమ్మీ ।
క్రౌంచాపురాస్తానకాననెలకొన్నట్టి చాముండీ కాముకొలనాడరమ్మీ ।
ఉజ్జయినీస్తానకాననెలకొన్నట్టి మాంకాళీ కాముకొలనాడరమ్మీ ।
హరిక్షేత్రస్తానకాననెలకొన్నట్టి కామరూపీ కాముకొలనాడరమ్మీ ।
కాశ్మీరపురస్తానకాననెలకొన్నట్టి మహావిద్యా కాముకొలనాడరమ్మీ ।
కరవీరపురస్తానకాననెలకొన్నట్టి మహాలక్ష్మీ కాముకొలనాడరమ్మీ ।
త్రింకోమలిస్థానకాన నెలకొన్నట్టి శాంకరీ కాముకొలనాడరమ్మీ ।
ప్రద్యుమ్న స్థానకాన నెలకొన్నట్టి శృంఖలా కాముకొలనాడరమ్మీ ।
జ్వాలాయా స్థానకాన నెలకొన్నట్టి వైష్ణవీ కాముకొలనాడరమ్మీ ।
మాహుగ్రామ స్థానకాన నెలకొన్నట్టి భవానీ కాముకొలనాడరమ్మీ ।
ఓఢ్రదేశ స్థానకాన నెలకొన్నట్టి గిరిజా కాముకొలనాడరమ్మీ ।
శ్రీశైలస్తానకాననెలకొన్నట్టి భ్రమరాంబా కాముకొలనాడరమ్మీ ।
ద్రాక్షావటీస్తానకాననెలకొన్నట్టి మాణిక్యాంబా కాముకొలనాడరమ్మీ ।
అలంపురాస్తానకాననెలకొన్నట్టి జోగులాంబా కాముకొలనాడరమ్మీ ।

పీఠికాపురాస్తానకాననెలకొన్నట్టి పురుహూతీ కాముకొలనాడరమ్మీ ।
ఇంద్రకీలాద్రిస్తానకాననెలకొన్నట్టి కనకదుర్గా కాముకొలనాడరమ్మీ ।
కేశనకుర్రూస్తానకాననెలకొన్నట్టి మూలకామేశ్వరి కాముకొలనాడరమ్మీ।
చౌదంతివలసాస్తానకాననెలకొన్నట్టి తూగుటుయ్యల కాముకొలనాడరమ్మీ ।

ఎత్తరమ్మా యీకొలనూ యేడ్వేలూ చేయూ, దించరమ్మా యీకొలనూ దీర్ఘాయువుగానూ, పట్టరమ్మా యీ కొలనూ పదివేలూ చేయూ, దించరమ్మా యీ కొలనూ దీర్ఘాయువుగానూ, ముట్టరమ్మా యీకొలనూ మూడువేలూ జేయూ, దించరమ్మా ఈ కొలనూ దీర్ఘాయువు గానూ, పాడరమ్మా యీ కొలనూ పదివేలూచేయూ, వినరమ్మా యీ కొలనూ వేనవేలూచేయూ, కొలువరమ్మా యీ కొలనూ కోటివేలూ చేయూ, దినదినమూ యీ కొలనూ దీర్ఘాయువు నిచ్చూ పుత్రాపౌత్రుల నిచ్చూ భోగమ్మూలిచ్చూ, ధన కనకావస్తూ వాహనములా నిచ్చూ, యిహ లోకాసుఖములా నన్నీటీనిచ్చూ, పరలోకా సుఖామూలా పదిలముగా నిచ్చూ – మనమాడు పాలకొలనూ మనమాడీ పాడంగా మనకామూ వెలసే, మనమెత్తీ దించంగా మనకామూ వెలసే, ॥ మనమాడు...॥

యీకరణిజేసిరి కామేశ్వరీ పూజ ఆ నాకమ్ము దేవతలు ఏకమై తనరార చేసిన పూజలు శృంగార మొప్ప, పూచినకల్పము పొలుపార గాను, లోకములో జనులకు ప్రాకటంబుగను, లోకములో విలసిల్లు చుండు, రూఢి కెక్కగనూ ఆయురారోగ్యములు ధన ధాన్యములను, ఆచంద్రార్క మందు సంతానములను, యిచ్చు ననుచు జెప్పి బ్రహ్మ నారదునితో ॥ ॥ మనమాడు...॥

ఈ కొలనుగొలిచిన కర్తాపేరేమి, కర్తపేరు రామన్న* కల్పవృక్షము. ఈ కొలనుగొలిచిన అతివపేరేమి అతివపేరు సీతమ్మ అరనైవదువా

॥ మనమాడు...॥

*(* ఇచ్చట కొలువు నిర్వర్తించు దంపతులు వారి యొక్క వారి పిల్లల యొక్క పేర్లు చెప్పెదరు) (ఆరనైదువా = ఆరని ఐదవతనము)*

ఓం సంతత శ్రీరస్తు । సమస్త సన్మంగళాని భవంతు ॥

## శ్రీ కామేశ్వరీ కొలనుపాట సమాప్తము

*(తరువాత ఋత్విజుల ఆశీర్వచనం)*

*మండప ఉద్వాసన :*

'ఆవాహిత సర్వేభ్యోదేవతాభ్యోనమః ।

యథాస్థాన ముద్వాసయామి ॥

అకాలమృత్యుహరణం సర్వవ్యాధినివారణం ।

సమస్త పాపక్షయకరం శ్రీ కామేశ్వరి దేవి పాదోదకం పావనం శుభం॥

*(ఈ మంత్రముతో పాలకొలనులోని పవిత్ర పాలను భక్తులపై చల్లెదరు.)*

*(పాలకొలనులోని మిగతా పాలను, శృంగారం ముగ్గు ప్రోగుచేసిన రజమును సూర్యాస్తమయము కాకుండా పచ్చని చెట్టుమొదలునందు పోయవలెను)*

---

## శాంతిమంత్రం

**ఓం సర్వేషాం స్వస్తిర్భవతు । సర్వేషాం శాన్తిర్భవతు ।**

**సర్వేషాం పూర్ణంభవతు । సర్వేషాం మంగళంభవతు ।**

**సర్వేభవంతు సుఖినః । సర్వేసంతు నిరామయా ।**

**సర్వేభద్రాణి పశ్యంతు । మాకశ్చిత్ దుఃఖభాగ్భవేత్ ।**

***ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ॥***

# శ్రీకామేశ్వరీ కథా ప్రారంభః

నారద ఉవాచ :

శ్లో ॥ సర్వ సంపత్కరం నృణాం సర్వా భీష్ట ప్రదాయకం, రహస్యం సర్వపాపఘ్నం పుణ్యం కలియుగేపివా, సురూపత్వంచ సౌభాగ్యం సౌఖ్యమాయుః ప్రవర్ధం ధనధాన్య సమృద్ధిశ్చ సుపుత్ర, త్వమవంధ్యతాం, పుత్రపౌత్ర సమృద్ధిశ్చ సుహృద్భ్రాతుర్వి వర్ధనం, కులవృద్ధిమరోగత్వం సన్మానం సర్వ బంధుభిః యత్రయేన భవేద్దేత ద్వ్రతం బ్రూహి మేపితా॥

తాత్పర్యము :

పూర్వమొకప్పుడు నారదుడు సత్యలోకంబున కరిగి నచట తన తండ్రి యగు బ్రహ్మతో నిట్లనియెను. ఓ తండ్రీ, చతురాననా! సమస్త సంపదలను ఇచ్చునట్టియు, సర్వ మనోరధములను చేకూర్చు నట్టియు, సర్వపాపములను పోగొట్టు నట్టిదియు, పుణ్యప్రద మయి నట్టిదియు, కలియుగంబున నుండు పాపములను పోగొట్టునదియు, మంచి రూపమును, సౌభాగ్యమును, సౌఖ్యమును, ఆయువును వృద్ధి పొందించు నట్టిదియును, ధనధాన్య సమృద్ధిని, వంధ్యాత్వమును పోగొట్టి సత్సంతాన మును ప్రసాదించు నట్టిదియు, పుత్రపౌత్రాభి వృద్ధిని, మిత్రులను, సోదరులను వృద్ధి పొందించు నట్టిదియును, బంధు మర్యాదను ప్రసాదించు నట్టిదియును, నగు మంచివ్రతము నొకదానిని నాకు తెలిపి సంతోష పెట్ట వలసినదని కోరెను.

బ్రహ్మోవాచః :

శ్లో ॥ అస్తి వ్రతం మహాభాగ కామేశ్వర్యాః ప్రపూజనం సర్వసం పత్కరం శ్రేష్ఠమభిలాభీష్టసిద్ధిదం ॥

నారద ఉవాచ :

శ్లో॥ కామేశీ నామ సా దేవీ యాదృశీ భువనేశ్వరీ, బ్రహ్మాణీ వాద సావిత్రీ, గాయత్రీవా రమాథవా భవానీవాథవేంద్రాణీ లోకనాథ నమోస్తుతే, జన్మకర్మ ప్రభావాది తస్యాస్సర్వం పదప్రభో.

బ్రహ్మోవాచ :

కామేశ్వాశ్చరితం పుణ్యం రహస్య మతిదుర్లభం, మయా సంక్షేపతః ప్రోక్తంసావధాన మనాశ్శృణు, ఇత్యుక్త్వా తాం సమస్కృత్వా కథాంపక్తుం ప్రచక్రమే

తాత్పర్యము :

ఓ నారదా! వినుము । కామేశ్వరీ వ్రతమను నొక మహావ్రతంబు కలదు. దాని వలన మానవుల సమస్త మనోరథములు సిద్ధించును. సర్వైశ్వర్యములును కల్గును. అని చెప్పగానే మరల నారదుడు బ్రహ్మదేవు నడిగెను. ఓ తండ్రీ ! ఆ కామేశ్వరి యను దేవి యెవరు? సరస్వతియా, సావిత్రియా లేక గాయత్రియా, లక్ష్మీదేవియా, భవానీ, ఇంద్రాణి మున్నగు దేవతలలో ఆమె ఎవరో, ఆమె పుట్టుక యెచటనో ఆమె చరితము నెరిగించుమన, నారదునితో బ్రహ్మగారిట్లనిరి. ఓ నారదా! శ్రీ కామేశ్వరీదేవి చరితము పుణ్య ప్రదము. అతిరహస్యము. అతిదుర్లభము. దానిని నీకు సంక్షేపించి దెల్పెదను గాన సావధాన మనస్కుడవై వినుమని పలికి ఇట్లు చెప్పదొడంగెను.

శ్లో॥ కైలాసశిఖరే రమ్యే సర్వదేవర్షి సేవితే ద్రుమైర్నిత్య ఫలైశ్చాపి శోభితే రమ్యదర్శనే, కల్ప నీ పామ్రమాలూర వటాది ద్రుమసంయుతే, తాత్వికైర్మూర్తిమద్భిశ్చయోగై స్సిద్ధిభిరేవచ, నిత్యముక్తైశ్చసిద్ధైశ్చ

శాంభవైర్నిత్యసేవితే, సమాగతా పితుర్గేహాత్పిపాసానుగామినం, సర్వజ్ఞం స్వసమీపస్తం సమస్కృత్వా సభక్తికం, ఉమాలోకహితార్థాయ పప్రచ్ఛ వినయాన్వితా చంద్ర శేఖర లోకేశ భూతానుగ్రహకారక జలమానయ మే శీఘ్రం పిపాసాబాధతే హిమాం, ఇత్యేవం జ్ఞాపితో గౌర్యా శివశ్శూలేన తత్రవై, ఆనందవాపీమకరోద మృతాబ్ధి సమాంశుభాం, లోకమాతా పపౌ క్షీరం దశవారం దశాంజలిం, దశగర్భా బభూవుస్తద్దశాంజలి మితం పయః, ఏకైకస్యాపిగర్భస్య ఘటీ నవక మంతరం, అంబికాయా స్సముద్భూత పాదయోరశికాంబికా, చీర్వాణీ చోరుకా డాగ్రే, పేర్వాణి చోరుమూలయోః, జక్కులాంబాతు కుచయోః, పృష్టాంతేయెన్ని కాంబికా, నాసికాయాంతు ముగ్ధా, భూర్ధమ్మిల్లే కొండవాణికా, కామేశీ నేత్రయోర్జాతా, నాభౌ పోతేశ్వరః, పుమాన్ వీరేశ్వరః, పృష్టమూలే సంజాతాః పృథివీతలే, తత్రకామేశ్వరీ ముఖ్యా సైవ లక్ష్మి శ్శివాపిసా, సైవ వాగ్దేవతా సైవమాయా సైవేశ్వరీసుతా, తాసాం శృంగారరరంగాణి కల్పితాని పురాదశ, క్రమ శస్సైకతం రంగం చిత్రరంగోరురంగకే, మృదురంగం రక్తరంగం ముక్తారంగాతి రంగకే, పీవరంగం హ్రస్వంగం విస్మృతం రంగమేవచ, రంగకేళిగతానాం వై వస్త్రాభరణ్యాభరణానిచ, ప్రపంచ మాతాపితరౌ పేటీభిర్ధ ధతుస్సమం, ఆనందవాపికాతీరే హరి బ్రహ్మాదిసేవితే, లీలాడోలో త్సవం చక్రుర్దేవాసుర నరాద్భుతం, హరిద్రాలేపనాభ్యం గమరోభిస్సమం ముదా, జలక్రీడాంతథాచక్రుస్సర్వ తీర్థగతామరైః బ్రహ్మాండభాండ మధ్యస్థైస్సహదేవీ సమన్వితైః

పీతాంబరధరా స్తత్రపుష్పా పచయమంగనాః కృత్యా బ్జాదీని సంగృహ్యా మనోజ్ఞాని ముదాన్వితాః

తాత్పర్యము :

పూర్వకాలమున రమ్యమగునట్టిదియు దేవతలచే ఋషులచే సేవించబడు చుండునట్టిదియు, నిత్యపుష్ప నిత్యఫల యుక్తమగు వృక్షములచే వ్యాపించబడి నట్టిదియు, మనోహరమగు కల్ప వృక్షముల చేతను కడిమి, మామిడి, వెలగ, మఱ్ఱి మున్నగు వృక్షములచే రమ్యమై నట్టిదియు, తత్త్వవేత్తలచేతను మూర్తీభవించిన యోగులతోను, సిద్ధులతోను జీవన్ముక్తులగు మహర్షులతోను, శివభక్తులతోను నిండి యున్న కైలాస శిఖరమందు పితృగృహమగు హిమాలయముల నుండి అపుడే వచ్చిన పార్వతీదేవి, దప్పికతో కూడుకున్నదై సర్వజ్ఞుడును తన సహచరుడును యగు సమీపము నందే యున్న తన భర్తయగు ఈశ్వరుని లోకహితార్థమై భక్తితో వినయపూర్వకముగా ఇట్లు ప్రార్థించెను. ఓ చంద్రశేఖరా, విశ్వేశ్వరా! సమస్త భూతములను అనుగ్రహించేవాడా! నాకు మిక్కిలి దాహమగు చున్నది. కాన త్వరితముగా జలమును గొని తెమ్ము- అని పార్వతిచే ఆజ్ఞాపించబడిన శివుండు తన త్రిశూలముచే అచటనే త్రవ్వి ఆనందవాపిని చేసెను. అమృతమువంటి జలము గల ఆ నూతిలోని జలమును పదిదోసిళ్ళు పదిసార్లు ఆ పార్వతి త్రాగెను. అందువలన ఆమెకు పది గర్భములు కలిగెను. ఒక్కొక్క గర్భమునకు తొమ్మిది ఘడియలు వ్యవధానము కలిగి యుండెను. అపుడు ఆ పార్వతి పాదముల నుండి రశికాంబికయు, తొడల నుండి చీర్వాణియు, ఊరుమూలముల నుండి పేర్వాణియు, స్తనముల నుండి జక్కులాంబయు, పృష్టాంతము నుండి యెన్నికాంబికయు, ముక్కు నుండి ముగ్ధయు, కొప్పునుండి కొండ వాణికయు, నేత్రముల నుండి కామేశ్వరియు, నాభినుండి పురుషుడగు పోతేశ్వరుండును, పృష్ఠ మూలము నుండి వీరేశ్వరుండును ఆవిర్భవించిరి.

వీరిలో కామేశ్వరీ దేవియే ప్రముఖమైనది. ఆమెయే లక్ష్మి, పార్వతి సరస్వతి, మాయ, ఈశ్వరి అని పిలవబడుచుండును. వీరికి పది శృంగార రంగములు గూడా కల్పించబడినవి. 1. సైకతరంగము, 2. చిత్రరంగము, 3. ఊరు రంగము, 4. మృదు రంగము, 5. రక్త రంగము, 6. ముక్తా రంగము, 7. అతిరంగము, 8. పీతరంగము, 9. హ్రస్వరంగము, 10. విస్తృత రంగము అనునవి. ఇట్టి రంగములయందు విహరించు దేవతలకు, వస్త్రములను ఆభరణములను గూడ పార్వతీపరమేశ్వరులు పెట్టెల కొలది సమకూర్చిరి. వీరికి ఆనందవాపీతీరమున బ్రహ్మ, విష్ణువు మున్నగు దేవతలందరును లీలాడోలోత్సవములను జరిగించిరి. అది దేవతలకు మానవులకు గూడా అద్భుతముగా నుండెను. దేవతాస్త్రీలు, అప్సరస్త్రీలు మున్నగు వారందరూ ఈ దేవతలకు పసుపు, నల్గుబిండి మున్నగునవి, పూసి అభ్యంగనస్నాన మొనరించిరి. జలక్రీడలను గావించిరి. దేవతా స్త్రీలతో గూడి యీ దేవతలందరూ, పుష్పాపచయ మొనర్చి, తామరపువ్వులు మున్నగు మంచి మంచి పూలను కొప్పుల యందమర్చిరి.

శ్లోకము :

తత్పుష్పాంచితధమిల్లా ఘటికాపూరితోదకాః, వసంత కేళీం చకృస్తాః శృంగాధిభిరతంద్రితాః, నానాపుష్ప రసైస్సార్థం నానారత్న సమన్వితైః, బహిర్గత్వా తతశ్శీఘ్రమేకా కామేశ్వరీ స్వయం, వటవృక్షం సమారూఢస్సంది శ్యాత్మస్సహోదరీః, కాశీ రామేశ్వరగయాకాంచ్యాది స్థానకాస్ప్రతి, సమానీయ చ తత్ర త్యదేవతాస్సకలాస్వయం, తాభిస్సంసే వితానిత్యం లోకరక్షణ లోలుపా, ప్రభుత్వం సర్వలోకానాం యయాచే పితరౌసుతా, అభినంద్యాథపితరౌ సుతాందుహితృవత్సలౌ, బ్రహ్మశక్తి

సమాయుక్తాం విష్ణుశక్తి సమన్వితాం, శివశక్తి సమాయుక్తాం కృత్వా చక్రతురీశ్వరీం, కులేశ్వరీం మనుష్యాణాం ఈప్సితార్థ ప్రదాయినీం, తథాప్రభృతిసాదేవీశక్తిత్రయ సమన్వితా, పూజ్యతే సర్వదా దేవైః భక్తాభీష్ట ప్రదాయినీ, కలౌ పాపౌఘబహుళే నరాణాం దుష్టచేతసాం దురాచార రతానాం చ దుష్టానాం చ దురాత్మానాం, బ్రహ్మఘ్నా నాంకులఘ్నానా మపి సంరక్షణాయ సా, జాగర్తిభూతలేనిత్యం కామేసీబద్ధకంకణా॥

*తాత్పర్యము :*

కొమ్ములు పిచికారీలు మున్నగు వాటితో జలమును గ్రహించి పుష్పరసముల గ్రహించియు వసంతోత్సవ మాచరించిరి. ఆ సమయ మున కామేశ్వరిదేవి కొంతదూరము వెళ్ళి అచట మఱ్ఱి వృక్షమునెక్కి కూర్చుని తన సోదరీలనందరినీ, యితర దేవతా స్త్రీల నందరినీ, కాశీ, రామేశ్వరం, గయ, కాంచీ మున్నగు పుణ్యస్థలముల నుండి అచట దేవతల నందరినీ రప్పించి తాను లోకరక్షణ యందు అభిలాష గలదై పార్వతీ పరమేశ్వరులను తనకు సర్వలోక పాలక మిమ్మని కోరెను. అందుకు తల్లితండ్రులగు పార్వతీ పరమేశ్వరులు చాల సంతసించి దుహితృవాత్సల్య ముచే వారు ఈ కామేశ్వరీదేవికి బ్రహ్మశక్తిని, విష్ణుశక్తిని, శివశక్తిని ప్రసాదించి మానవుల సమస్త కోరికలనూ సిద్ధింపజేయు కులేశ్వరినిగా అనుగ్రహించిరి. అప్పటి నుండియూ ఆ కామేశ్వరీదేవి శక్తి త్రయముతో కూడుకున్నదై దేవతల చేతనూ మానవుల చేతను గూడా భక్తాభీష్ట ప్రదాయిని అని కొనియాడ బడుచున్నది. పాపాత్ములకు నిలయమును, దుష్ట చేతస్కులు, దురాచారరతులు బ్రహ్మహత్యాది సమస్త పాతకములను చేయువారు, కులములను హింసించువారు అగు నరులకు యీ కలియుగ మందు భక్తులగు మానవుల సమస్త పాపములను పోగొట్టుటకై బద్ధకం కణయై యీ కామేశ్వరీదేవి నిత్యము జాగరూకతతో నిలిచియున్నది.

శ్లోకము :

తస్యాః ప్రపూజనం పుణ్యం కలావపివిశేషతః పరస్త్ర్యా సక్తమనసాం పరద్రవ్యాభిలాషిణాం, నాస్తికానాంచ మూఢానాం గతిః కామేశ్వరీ నృణాం॥

తాత్పర్యము :

అట్టి కామేశ్వరీదేవి పూజ చాలా పుణ్యప్రదము. మరియు ఈ కలియుగములో తరచు పరస్త్రీల యందాసక్తి కలవారున్నూ, పర ద్రవ్యాభిలాషులున్నూ, నాస్తికులు, మూఢులను యగు మానవులు హెచ్చుగా నుందురు. అట్టివారిని తరింపజేయుటకు ఈ కామేశ్వరీ పూజయే ముఖ్యమగు గతి అయివున్నది.

నారద ఉవాచ :

శ్లోకము : తత్పూజనిం కథం కార్యమాత్మ భక్తైః కలౌ ముగే, తద్విధానం మమాచక్ష్వ తతలోక పితామహ ॥

బ్రహ్మోవాచ :

శ్లోకము : ఉత్తరాయణగే భానౌ మకరస్థేదివాకరే ఆద్యంత యోశ్చుపాదినం శుక్ల పక్ష విశేషతః, భార్గవేందుబుధాదిత్య గురూణా మేవవాసరే, యధామనోహరం భక్త్యా యథానిర్థిష్ట మాత్మని తథైవా నూనమాబాలమా వృద్ధాన్‌బాంధవైస్సహా, ప్రాతస్నాత్వా శుచిర్భూత్వా కామేశ్యావ్రతమాచరేత్, స్వశ క్త్యైవసువర్ణేన రౌప్య తామ్రాదికేసవా. సహజా సప్తకయుతాం సోదరద్వయసంయుతాం, లీలాడోలా మధ్య గతామశక్త శ్చేత్సుదారుణా, కామేశ్వర్యా కృతింకుర్యా ద్విత్తశార్యం నకారయేత్ ॥ స్వగృహస్యోత్తరే దేశేమంటపం కారయేతత్తః। తన్మధ్యే త్రిదళంపద్మంయ వైర్వా తండులైశ్శుభైః ॥

తాత్పర్యము :

అపుడు నారదుడు తండ్రియగు బ్రహ్మదేవుని అడుగుచున్నాడు. ఓ లోకపితామహా! తండ్రీ ! కలియుగము నందలి మానవులు తరించుటకు ఆ కామేశ్వరి నెట్లు పూజింపవలయును? ఆ విధానమును నాకు సెలవిమ్ము అని అడుగగా బ్రహ్మదేవుడిట్లు చెప్పెను, సూర్యుండు త్తరాయణము నొంది యుండగా మకరమాసమందలి శుక్లపక్ష మందుననూ, శుభకార్యముల అనంతరములందున్నూ, ఈ కామేశ్వరీ పూజ చేసుకొనుటకు చాల ప్రశస్త మైనది. ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారములు చాల మంచివి. భక్తితో మనోహరమగునట్లు తనకు సంతోషము కలుగునట్లు, బంధువులతో కూడి మిక్కిలి వైభవముగా కామేశ్వరీపూజను జరిగించవలయును. ప్రాతః కాలమందు స్నానము చేసి శుచియై కామేశ్వరీ వ్రతము నాచరించ వలయును. తనశక్తి ననుసరించి, బంగారము, వెండి, రాగి మున్నగు లోహములచే, కామేశ్వరీదేవిని సోదరసోదరీలతో కూడి యుండి విలాసముగా ఉయ్యాలలో మధ్యనున్నదానినిగా నిర్మించి పూజించ వలయును. శక్తి లేనిచో మంచిదారువు (కఱ్ఱ) చేతనైననూ కామేశ్వరీ విగ్రహమును నిర్మించుకొనవలెను. లోభత్వము పనికి రాదు. తన గృహమందలి ఉత్తర ప్రదేశమున మండపమును నిర్మించి మండప మధ్యభాగ మందు త్రిదళాకృతిగా పద్మముగా నేర్పరిచి యవలచే గాని, తండులములచే గాని మండపము నిర్మించవలెను.

శ్లోకము : ప్రతిమాంతత్ర సంస్థాప్య పూజయేద్బంధుభిస్సహా, శ్వేతగంధాక్షతైః పుష్పైహారిద్రాకుంకుమాన్వితైః ధూపైర్దీపైశ్చనై వేద్యైర్గు డపిష్టార్ధసూపకైః రంభాఫలైర్నారికేళైరిక్షుఖండైర్గుడోదకైః, యేవమన్య

ఫలాపూపైర్నై వేద్యం కారయేత్సుధి, సువర్ణపాత్రే గోదుగ్ధంనిధా యాదాయ భక్తితః తదాతదా నందసర స్తీర్థ ప్రతినిధింసుధీః కృత్వాత్మ బాంధవైస్సార్థం కుర్యాదవ బృథం మునే, వృద్ధాను పూర్వమాబాలం దేవీగానపురస్సరం, శ్రద్ధాభక్తి యుతో మర్త్యః పూజాంతే తత్కరోతియః, గంగాది సర్వతీర్థేషు స్నాతో భవతి పుత్రక, తత్పంచ ప్రస్తశాలియవగుడపిష్టాదికంమునే, వృద్ధాను పూర్వమాబాలం ప్రత్యేకం మిథునకమాత్, దత్తపూర్వం చిరంటిభ్యో భక్షయేద్భిక్షితంశుభే త దేవ కామ కామేశి దత్తమిత్యభి భావయేత్, నృత్తగీతైశ్చ వాద్యైశ్చ పురాణపఠనాదిభిః ॥

*తాత్పర్యము :*

దానియందు ప్రతిమనుంచి బంధువులతో గూడిన వారై కామేశ్వరీదేవిని పూజింపవలయును. తెల్లని మంచి గంధము అక్షతలు పసుపుకుంకుమలతో పూజింపవలయును. ధూపములచేతనూ, దీపముల చేతనూ, నైవేద్యములచేతను అర్చించవలయును. చలిమిడి వడపప్పు మున్నగువాటిని నివేదించవలయును. అరటిపళ్ళు, కొబ్బరి ఫలములు, చెరకుముక్కలు, పానకము ఇట్లే అప్పములు, పాయసము మొదలగు, భక్ష్యములు నైవేద్యము పెట్టవలయును, బంగారు పాత్ర యందు ఆవుపాలు పోసి వాటిని గూడ నివేదింపవలయును. అప్పు డప్పుడు ఆనందతీర్థజలము యొక్క ప్రతినిధిగా భావన చేసి పాలతో, భక్తితో, బంధువులతో అవబృథస్నాన మాచరించ వలయును, ఆ బాలస్త్రీ వృద్ధు లందరునూ దేవిని గూర్చి పాటలు పాడుచూ, పూజాంతమందు భక్తితో శ్రద్ధగా యిట్లు పూజను జరిగించి ఆనందతీర్థ సంబంధమైన గోక్షీర ములను బంధు సహితముగా మార్జన చేసుగొనవలయును. ఇట్లు చేసినచో

గంగాది సర్వతీర్థముల యందునూ స్నానమాచరించి నంతటి ఫలము నొందుదురు. (ఇట్లు) అయిదుమానికల పిండికి తక్కువ కాకుండా ఐదుకుంచముల పిండితో శక్తిననుసరించి చేసిన చలిమిడి ఉండలు చేసి వృద్ధ దంపతులు మొదలుగా వరుస క్రమముగా ఈ చలిమిడి ఉండల నివ్వవలయును. తరువాత వారి వలన యాచించి తాను ఆ చలిమిడిని కొంచెం తీసుకొని అది కామేశ్వర, కామేశ్వరీదేవతలచే యివ్వబడిన దానినిగా భావన చేసుకుంటూ, తానూ భార్య వగైరా కుటుంబము వారు భక్షించవలెను. ఆ రోజున నృత్తగీతాదులచేతనూ మంగళ వాద్యముల చేతనూ పురాణపఠన శ్రవణాదులతో గడపవలయును.

*శ్లోకము :*

తేషయేద్గణనాతీతాన్ విప్రాన్ దానేన భోజనైః బంధుభిస్స్వజనై స్సార్థమర్చయేచ్చ సువాసినీః, అథవైకోత్తర రతం చిరంటీనాం కవి ద్వయం, తర్పయేదథవాయోషిత్సప్తకం విప్రయుగ్మకం, భోజయే ద్భక్తిసంయుక్త స్వయం భుంజీత బంధుభిః, దక్షిణాం చ యధాశక్తి వస్త్రాణ్యాభరణాని చ, దధ్యాదిదంయః కురుతేకామేశీపూజనంమునే, తస్యకార్యాణి సిధ్యంతే నాత్రకార్యా విచారణా, త్రైలోక్య విస్తృంచైవ ద్వ్రతం సర్వవ్రతోత్తమం, చీర్ణమేత ద్వ్రతం సర్వైః పూర్వకల్పే సురాసురైః, శక్రేణాచరితం పూర్వం వృత్రాసుర వధేతథా, అమృతో త్పాదనార్థాయ కృతం దేవాసురరైరపి, భగీరథేనతద్వచ్చ గంగామానయతా పురా, రామచంద్రేణ తద్వచ్చ సీతాయాః పరిమార్గణే, గోవర్ధనస్యోద్ధరణే కృష్ణేనాపి మహామునే, కృతం బ్రహ్మర్షిభి స్సార్థకురుత్యమపిభక్తితః, విజయస్తే భవేన్నిత్యం సర్వలోకేషు నారద ॥

తాత్పర్యము :

ఆ రోజున విచ్చేసిన బ్రాహ్మణులను దానములచేతను భోజనముల చేతను సంతోషపెట్టవలయును. తన యింటివారితోను బంధువులతోను గూడి ఆ రోజున సువాసినీ స్త్రీలను అర్చించ వలయును. నూట ఎనమండు గురు పేరంటాండ్రనుగాని, యిద్దరు కవులనుగాని, లేక ఏడుగురు ముత్తైదువలను, యిద్దరు బ్రాహ్మణులను గాని ఆ రోజున భక్తితో భుజింప చేయవలయును. అటుపిమ్మట బంధువులతో భుజించ వలయును. పేరంటాండ్రుకు వస్త్రములు, ఆభరణములు, దక్షణలను యథాశక్తిగ పంచిపెట్టవలయును. ఈ ప్రకారము ఈ కామేశ్వరీపూజ నెవ్వరు చేయుదురో వారిసమస్త మనోరథములు సర్వకార్యములు సిద్ధించును. ఇందుకు సందేహ మేమియూ లేదు. ఈ వ్రతము అన్ని వ్రతములకంటెను చాల ఉత్తమమైనది. ముల్లోకములయందును ప్రసిద్ధిచెందినది. పూర్వ కల్పములయందు ఈ వ్రతము దేవతలచేతనూ, అసురులచేతను గూడ చేయబడినది. వృత్రాసురుని వధించుసమయమున దేవేంద్రు నిచే యీ వ్రతమాచరింపబడినది. అమృతోత్పాదన సమయమున దేవాసురులచే ఈ వ్రతమాచరింపబడినది. గంగను భూలోకమునకు తీసుకొనివచ్చు నప్పుడు భగీరథుడీ వ్రతమును జేసి కృతార్థుడయ్యెను. సీతాదేవిని వెతుకుచున్న సమయంబున శ్రీరాముడీ వ్రతము నొనరించెను. ఓ నారదా! గోవర్ధనపర్వతము నుద్ధరించునపుడు శ్రీకృష్ణుడీ వ్రతమును చేసెను. భక్తితో బ్రహ్మర్షులందరి తోను నీవుగూడ యీ వ్రతమాచరిచుము. సర్వలోకములయందును నీకు విజయము చేకూరును.

శ్లోకము :

విద్యార్థీలభతే విద్యాం యశోర్థీ చాప్నుయాద్యశః, ధనార్థీలభతే విత్తం పుత్రార్థీ లభతే సుతాన్ ॥

తాత్పర్యము :

మరియు విద్యనుకోరి యీ వ్రత మాచరించిన విద్యలు వచ్చును. కీర్తినిగోరి చేసినచో కీర్తినొందును. ధనమునుకోరి చేసినచో ధనమును, పుత్రులనుగోరి యీ వ్రతమాచరించిన పుత్రులను బొందుదురు. ఇది సత్యము.

శ్లోకము :

బ్రాహ్మణ క్షత్రియో వైశ్య శూద్రో వాప్యథవా స్త్రీయః భక్త్యా శ్రీకామకామేశీవ్రతం కుర్యాద్యథావిధి ॥

తాత్పర్యము :

బ్రాహ్మణులుగాని, క్షత్రియులుగాని, వైశ్యులు, శూద్రులుగాని లేక స్త్రీలు గాని యీ కామకామేశ్వరీ వ్రతమును యధావిధిగా చేసుకొనవచ్చును.

శ్లోకము :

కామేశ్వరీ పూజకస్తు గజాం త్రైశ్వర్యయాప్నుయాత్. మానవానా మిదం పుణ్యం కార్యం సర్వయుగేష్వపి సకలౌఘోరే కార్యమేతద్వి శేషతః యఏవమాచరేద్విద్వాన్ నారీ వా పురుషోపి వా, ఇహభుంక్త్వాభి లాన్భోగాన్ అంతే కామేశ్వరీం స్మరన్ సువర్ణనవరత్నాఢ్యం విమాన మధిరుహ్యాచ, గంధర్వైసూయమానశ్చ నృత్యద్భిశ్చాప్సరోగణైః లోకా లోకమను ప్రాప్య పూజ్యమానా సురాసురైః కామేశీ నగరం గత్వా కులకోటిసమన్వితః దేవీహాయుజ్య మాప్నోతి పునరావృత్తి వర్జితః ॥

తాత్పర్యము :

ఈ కామేశ్వరీ పూజచేసినవారు గజాంతైశ్వర్యము నొందుదురు. అన్ని యుగములందును మానవులకు ఈ వ్రతము ఉత్తమోత్తమ మైనది. కలియుగమునందు యీ వ్రతమును తప్పక ఆచరించ తగినది. ఇట్లు పురుషులుగాని, స్త్రీలుగాని యెవరు చేయుదురో వారు ఇహ లోకములో సర్వసౌఖ్యములనొంది, అంత్య కాలమున ఈ కామేశ్వరీ స్మరణ కలిగి దానిచే నవరత్న ఖచితమగు బంగారు విమానము నదిష్టించి, గంధర్వులచే కొనియాడబడుచు, అప్సరసల నృత్య గీతముల నానందించుచు ఊర్ధ్వ లోకముల కరిగి, సురాసురు లచే కీర్తింపబడుచు, పునరావృత్తి రహితమగు కామేశ్వరీ నగరమును జేరి దేవి సాయుజ్యము నొందెదరు.

శ్లోకము :

యు ఏవంకురుతే భక్త్యా శ్రావయేద్వాశృణోతివా, సయాతి శాంభవీలోకం జరామరణవర్జితం ॥

ఇతి శ్రీశక్తి పురాణే బ్రహ్మానారద సంవాదే కామేశ్వరీ వ్రతకథాధ్యాయం సమాప్తః ॥

తాత్పర్యము :

కావున యే మానవులు యీ వ్రతమును భక్తి శ్రద్ధలతో చేసెదరో లేక యీ వ్రతకథను సాంతముగా, సావధానముగా విందురో, వినిపించుదురో వారు జరామరణ వర్జితమగుదేవీ లోకము నొందెదరు.

ఇట్లు శక్తి పురాణమందలి నారదబ్రహ్మాసంవాద రూపమగు కామేశ్వరీ వ్రతకథ సమాప్తము.

# శ్రీ మత్కామేశ్వరీ అష్టకము

శ్లో॥ త్రిలోకసంచారి త్రిపురహరమౌళిస్థసుఫణి
ఫణాలగ్నాదిత్యో ఫలవిరచితాం ధ్ర్యబ్జ కలితాం
త్రివేదాత్మాభద్రాం త్రిదశగణవంద్యాం త్రిణయనాం
భజేహం త్వాం కామేశ్వరి సురపురంధ్రీ జనయుతాం ॥ 1

శ్లో॥ మహత్తేజోరూపాం మణిఖచితసింహాసనపదాం
భవాంభోధేః కోలాం భువనజనసంరక్షణపరాం
సురజ్యేష్ఠాంభోజేక్షణ నిబిడబద్ధాంజలిపుటాం ॥ భజేహం ॥ 2

శ్లో॥ శుభాకారాం దామోదరహరసుర జ్యేష్ఠ కలితాం
పరాం శ్రీ గౌరీవాక్పరమరమణీయాకృతియుతాం
త్రిలోకేరక్తాం తాం శరణరతనేత్రాంత కలితాం ॥ భజేహం ॥ 3

శ్లో॥ అవిద్యాపధ్వంశీం హరిమకుటశోభాం చిత్పదాం
దధన్మాయాకారాం దనుజనికరఘ్నాం కలిహరాం
రిపుచ్ఛేదీం ధీరాం మునిజనసహస్రార్చిపదాం ॥ భజేహం ॥ 4

శ్లో॥ చలన్ముక్తాహారాం సమరరిపు ఘోరాం జయకరాం
కళాధారాం హేమాచలనిభ సుధీరాం శుభకరాం
స్థిరాం వీణాతంత్రీక్వణనతర వార్యుద్భవకరాం॥ భజేహం॥ 5

శ్లో॥ భవచ్ఛేదాసక్తాశ్రితజన సుమందారకలితాం
స్ఫురద్రూపీం వేణీవిజితఘనబృందామఘలతాం
లవిత్రాంతా శేషాగణితగుణ బృందామనుపమాం ॥ భజేహం ॥ 6

శ్లో॥ మృగాక్షీమప్యగ్రాం మునిజనహృదబ్జే నివసతీం
కృపాపూర్ణాం లోకాభయకరసమర్ధాం సువదనాం
జగద్ధాత్రీం వేదాంతరిత మహిమానం గుణనిధిం ॥ భజేహం ॥ 7

శ్లో॥ చలద్గంగాభంగోల్లసిత మృదువాక్యాంతవదనాం
అచింత్యామవ్యక్తామసురసురకాంతార్చి తపదాం
కృపాలంబాం శోభావిజితరవిచంద్రాం సువదనాం ॥ భజేహం ॥ 8

శ్లో॥ చిరం భుక్త్వా భోగానిహహిపరమాన్ యస్తు మనుజో
విముక్తః కైవల్యం విమలసుఖమిచ్ఛేత్పరతరం
పఠేత్కామేశ్వర్యష్టకమిద ముదారార్ధరుచిరం
త్రికాలేష్వేకాగ్రస్సఖలు పురుషో భక్తి కలితః 9

*కామేశ్వరీ అష్టకం సంపూర్ణం.*

## కామేశ్వరీ అష్టకం

శ్లో॥ దుష్టజనాభీష్టఘ్నుమిష్టాష్టైశ్వర్యదాయినీం
ఆద్యాం సృష్టిస్థితిలయకర్త్రీం అష్టమశివకన్యకామహం కలయే ॥ 1

శ్లో॥ కళ్యాణగుణసంపన్నాం కారుణ్యామృతసాగరాం
వందారుజనమందారాం వందే కామేశ్వరీం సదా ॥ 2

శ్లో॥ కోమాలాంగీం హేమవర్ణాం కోటి సూర్యసమప్రభాం
కరుణారససంపూర్ణాం వందే కామేశ్వరీం సదా ॥ 3

శ్లో॥ విశ్వరూపీం విశ్వకర్త్రీం విష్ణుబ్రహ్మేశ్వరార్చితాం
విద్యుత్ సూర్యాగ్నినయనాం వందే కామేశ్వరీం సదా ॥ 4

శ్లో॥ రమాగౌరీ వాక్స్వరూపాం రక్షోమూల విఘాతినీం
రంగకేళి సమాయుక్తాం వందే కామేశ్వరీం సదా ॥ 5

శ్లో॥ స్వభక్త పాపసంఘాత నాశనీం భవమోచనీం
అజ్ఞానాంధతమోహంత్రీం వందే కామేశ్వరీం సదా ॥ 6

శ్లో॥ గుణత్రయాత్మికాం లోకజననీం జన్మపావనీం
ఆనందసచ్చిత్స్వరూపాం వందే కామేశ్వరీం సదా ॥ 7

శ్లో॥ భక్తాభీష్ట ప్రదామాద్యాం భర్మడోలాధివాసినీం
భానుకోటిప్రభాయుక్తాం వందే కామేశ్వరీం సదా ॥ 8

శ్లో॥ సోదరీసోదరయుతాం సురనారీసుసేవితాం
సుఖదాం సుందరాకారాం వందే కామేశ్వరీం సదా ॥ 9

కామేశ్వరీ అష్టకం సంపూర్ణం

రచన : **కీ॥శే॥ ఆకొండి సీతారామయ్యగారు**

*(వీరి మనుమడు శ్రీ ఆకొండి కామేశ్వర శాస్త్రిగారు. ఆయుర్వేదవైద్యులు, కేశనకుర్రు తూ॥ గో॥ జిల్లా వారి సౌజన్యముతో ప్రచురింపబడినది.)*

# కామేశ్వరీ స్తవము

శ్లో॥ మాతా పితా సఖా బంధుసర్వం కామేశ్వరీమతం ।
తస్యాస్త్వన్యాం నపశ్యామి త్రిలోకేష్వపి దేవతాం ॥ 1

శ్లో॥ జగత్కుంటుంబినీ లోకజననీ కులదేవతే ।
కామేశ్వరి నమస్తుభ్యం తారస్వభవాంబుధేః ॥ 2

శ్లో॥ త్వమేవపోషకా మాతా పితాచ త్వంకులేశ్వరి ।
గతిర్మేనాస్తి త్వత్తోన్యా పాహిమామంబ సర్వదా ॥ 3

శ్లో॥ త్వత్పాద సేవానిరతం త్వదనుగ్రహకాంక్షిణం ।
అనాథంపాహి మాం దేవి కామేశ్వరి కులేశ్వరి ॥ 4

శ్లో॥ అనాథపాలనపరే ఆశ్రితా మరవల్లికే ।
అన్యదైవమజానంతం అనాథం పాలయస్వమాం ॥ 5

శ్లో॥ రక్షమాం త్వంజగద్ధాత్రీ రక్షమాం కులదేవతే ।
రక్ష కామేశ్వరీదేవీ త్వదన్యానాస్తిమే గతిః ॥ 6

శ్లో॥ ధనవృద్ధిం ధాన్యవృద్ధిం కులవృద్ధిం కులేశ్వరి ।
పుత్రపౌత్రాభివృద్ధిర్మే సర్వదే సర్వదా కురు ॥ 7

శ్లో॥ శ్రియం దేహి యశో దేహి జయం దేహి ద్విషోజహిం ।
ఆరోగ్యం దేహి మేదీర్ఘ మాయుః పుత్రాంశ్చ దేహిమే ॥ 8

శ్లో॥ రక్షమామిష్టకామేశి రక్షమాం భువనేశ్వరీ ।
రక్ష రక్షాత్మభక్తం మాం రక్షరక్షేష్టదేవతే ॥ 9

శ్లో॥ కామేశ్వర్యాస్తవం పుణ్యం యేశృణంతిపఠంతియే ।
తే సర్వే సర్వకార్యాణి ప్రాప్నువంతి నసంశయః ॥ 10

కామేశ్వరీస్తవం సంపూర్ణం.

# శ్రీ కామేశ్వరీ దేవతా దండకము

శ్రీ మన్మహాదేవి కామేశ్వరీ । సర్వలోకేశ్వరీ । రాజరాజేశ్వరీ । పరమేశ్వరీ । ఈశ్వరీ । మహేశ్వరీ । శాంకరీ । సర్వలోక రక్షాకరీ । నీ నామధేయుండ నీ చరణ దాసుండ । భవ ద్దివ్యపాదాబ్జముల్గొల్చి సేవించి సంస్తుతింప నూహించితిన్ । కృపా దృష్టి వీక్షించి – ప్రసన్న వదనముతో – దయారసము నా పైన ప్రోక్షించి – రక్షింపుమో తల్లీ । భవానీ । శివానీ । రుద్రాణి । శర్వాణీ । కాత్యాయనీ । సహస్ర కోటి భాను ప్రభాదివ్యతేజంబుతో – దేదీప్యమాన నవరత్న ఖచిత మకుటంబుతో – రత్నకంకణ కింకిణి మణి నినదంబుతో కేయూర హారంబుతో – అష్టభుజంబులన్ ఆయుధ ధారివై – చిద్విలాసంబుతో – దివ్యమంగళ స్వరూపంబుతో – భాసిల్లు కామేశ్వరీ । జగన్మాతవై – సహస్ర నామంబులన్ – భిన్నరూపంబులన్ – దివ్యతేజంబులన్ – శోభిల్లు – జగన్మోహినీ । బ్రహ్మ విష్ణు సురేంద్రాదులున్ – నీయడుగు దమ్ముల్గొల్చి – సేవింతురంబా। భైరవీ । సావిత్రీ । గాయత్రీ । భగవతీ। నీమూర్తి – నీకీర్తి – వర్ణింప – నేనెంత । నన్నేలు కృపా సాగరీ । పరబ్రహ్మ స్వరూపిణీ । సకల భువనంబులన్నిండి – వ్యాపించి – నిమిత్త మాత్రంబుగా – హరిహర బ్రహ్మాదులన్ – రక్షింప – వధింప – సృజింప – వేర్వేరు నియమించి – పాలింతు వమ్మా । శాంభవీ । సంగీతగాన వినోదినీ । మృదంగాది వాద్య సమ్మోదినీ । సకలజన పదంబులన్ – దుర్గాంబవీవంచు – శ్యామాంబ

వీవంచు – కామాక్షి – మీనాక్షి విశాలాక్షి వీవంచు – మహాశక్తి యన్భా వంబునన్ – సమస్తంబునీవంచు – నిన్గొలుతురమ్మా। కామేశ్వరమ్మా। ఆదిశక్తి। హైమవతీ। లలితా। ఉమా। గౌరీ। భక్తి ప్రపత్తితో మేమిచ్చు ధూపదీపనైవేద్యముల్ – ఉపాహారంబులంగొంచు – మా పూజ – మాసేవలెన్మెచ్చి – మా కోర్కె లీడేర్చవో। దాక్షాయణీ। చండికా। కాళికా। చాముండికా। ధూమ్రాక్ష మూక మహిషా సురాదులంజంపి – నీ పరాక్రమంబున్ – ప్రదర్శింపవో – లోకములో। ఆరామవాసితుల, ఆరామద్రావిడుల ఆకుండి వంశంబులన్ బ్రోవగా – మున్నూరా బ్దంబులన్వెనుక – చౌదంతివలస గ్రామంబులో దక్షిణ దిగ్భాగంబునన్ – తూగుటుయ్యలలో సప్తమాతృల సహితంబుగా వెలసి – మా యిలవేల్పువైచెన్నొందు కామేశ్వరమ్మా। స్వదోషంబు సైరించి – నేరంబు మన్నించి – సకల సంపత్తులన్ – ఆయురారోగ్య ఐశ్వర్యముల్ – ప్రసాదించి నన్గాచి – రక్షించుతల్లీ। అజ్ఞానముంబాపి – సుజ్ఞానమునిచ్చి – సద్గతింజూపించు మమ్మా। కామేశ్వరమ్మా। ఇవియె – నా నమస్కృతు ల్గొమ్ము దేవీ కామేశ్వరీ – నమస్తే నమస్తే। నమస్తే నమః ॥

రచన

పార్వతీపురం

**కీ॥శే॥ ఆకుండి కామేశ్వరరావు**

*(వీరి కుమారుల సౌజన్యముతో ప్రచురింపబడినది.)*

# నవరత్న మాలికా స్తోత్రము

1. హారనూపుర కిరీటకుండల విభూషితా వయవ శోభినీం
కారణేశవరమౌళికోటి పరికల్ప్యమాన పదపీఠికాం ।
కాలకాలఫణిపాశబాణ ధనురంకుశామరుణమేఖలాం
ఫాల భూతిలక లోచనాం మనసిభావయామి పరదేవతాం ॥

2. గంధసారఘనసార చారునవనాగవల్లి రసవాసినీం
సాంధ్యరాగ మధురాధరాభరణ సుందరానన శుచిస్మితాం ।
మంధరాయత విలోచనామమల బాల చంద్రకృతశేఖరీ
మిందిరారమణ సోదరీం మనసి భావయామి పరదేవతాం ॥

3. స్మేరచారు ముఖమండలాం విమల గండలంబిమణికుండలాం
హారదామ పరిశోభమానకుచ భారభీరు తను మధ్యమాం ।
వీరగర్వహర నూపురాం వివిధకారణేశ వరపీఠికాం
మారవైరి సహచారణీం మనసి భావయామి పరదేవతాం ॥

4. భూరిభారదధర కుండలీంద్ర మణిబద్ధ భూవలయపీఠికాం
వారి రాశి మణిమేఖలావలయ వహ్ని మండల శరీరిణీం ।
వారిసార వహకుండలాం గగనశేఖరీంచ పరమాత్మికాం
చారుచంద్ర రవిలోచనాం మనసిభావయామిపరదేవతాం ॥

5. కుండల త్రివిధకోణ మండల విహార షడ్దళ సముల్లసత్
పుండరీక ముఖ భేదినీం తరుణ చండభాను తడిదుజ్జ్వలాం ।
మండలేందు పరివాహితా మృత తరంగిణీ మరుణరూపిణీం
మండలాంత మణిదీపికాం మనసిభావ యామి పరదేవతాం ॥

6. వారణానన మయూర వాహముఖ దాహ వారణ పయోధరాం
చరణాది సురసుందరీ చికురశేఖరీకృత పదాంబుజాం ।
కారణాధిపతి పంచకప్రకృతి కారణ ప్రథమ మాతృకాం
వారణాంత సుఖపారణాం మనసిభావయామి పరదేవతాం ॥

7. పద్మకాంతి పదపాణి పల్లవ పయోధరానన సరోరుహాం
పద్మరాగ మణిమేఖలావలయ నీవిశోభిత నితంబినీం ।
పద్మసంభవ సదాశివాంతమయ పంచరత్న పదపీఠికాం
పద్మినీం ప్రణవ రూపిణీం మనసిభావయామి పరదేవతాం ॥

8. ఆగమ ప్రణవ పీఠికామమల వర్ణ మంగళశరీరిణీం
ఆగమా వయవ శోభినీం అఖిల వేదసార కృత శేఖరీం ।
మూల మంత్ర ముఖమండలాం ముదిత నాదబిందు నవయౌవనాం
మాతృకాం త్రిపుర సుందరీం మనసి భావయామి పరదేవతాం॥

9. కాళికాతిమిర కుంతలాంత ఘనభృంగ మంగళ విరాజినీం
చూళికాశిఖర మాలికావలయ మల్లికాసురభి సౌరభాం ।
కాళికామధుర గండమండల మనోహరానన సరోరుహాం
కాళికా మఖిల నాయికాం మనసిభావయామి పరదేవతాం ॥

10. నిత్యమేన నియమేన జపతాం భక్తిముక్తి ఫలదాం అభీష్టదాం
శ్రీ శంకరేణ విరచితాం సదా జపేత్ నామరత్న నవరత్న మాలికామ్ ॥

## ఆరామ ద్రావిడశాఖలోని గోత్రములు, ప్రవరలు, ఇంటిపేర్లు

ఈ శాఖలో ఋగ్వేదులు, యజుర్వేదులు, సామవేదులు యున్నారు. వీరిలో వీరికి సంబంధములు కలవు. ఆకుండి (ఆకొండి) వారు ఋగ్వేదులు. వీరిలో కామాకుండి, దుర్గాకుండి, వ్యాసాకుండి యని మూడు విధములుగా యున్నారు. వీరిలో వీరికి సంబంధములు, పురుడు పుణ్యములు లేవు. గోత్రములు, ఋషులు ఒక్కటియే.

గోత్రమనగా ఒకశాఖకు చెందిన మూలపురుషుడని కానీ, ఋషికి చెందినపుత్ర పౌత్రాది పరంపరయని కానీ చెప్పవచ్చు. గోత్రములందరి ఋషులు ఆ యా శాఖలందలి మూల పురుషుల పుత్రపౌత్ర పరంపరలో వారుగా గానీ, శిష్య ప్రశిష్య పరంపరలోని వారుగా గానీ అయి యుందురు. గోత్రమునకు చివర 'స' కారము చేర్చవలెనని కొందరు, చేర్చకున్ననూ తప్పులేదని మరికొందరు చెప్పుదురు.

ప్రవరయనగా గోత్ర గణము యొక్క మూలపురుషునితో సహా తన ఆత్మ బంధువులయు, సనాతన మహర్షులయు పేర్లను కలిపి తాను ఆ కుటుంబమునకు చెందిన వాడనని చెప్పుకొనుట. ప్రవరలో ఒకటి నుండి ఏడుగురు వరకూ ఋషులపేర్లు ఉండును. (19 ఋషుల పేర్లు యున్న ప్రవర కూడ యున్నది).

ప్రవరయందు ముగ్గురు కంటే హెచ్చు ఋషులున్న గోత్రజ్ఞు లను వరింపరాదని అథర్వ సూత్రకర్తలు నిర్ణయించి యున్నారు. ఈ కారణముగా శ్రౌతకర్మలందు ప్రవర యందలి మొదటి ముగ్గురు ఋషులతో కూడిన ప్రవరను మాత్రమే చెప్పుకొనవలెను. స్మార్త కర్మలందు ఋషి సంఖ్యా నిషేధము లేదు గాన, పూర్తి ప్రవరను (అనగా ప్రవరలోనున్న ఋషు లందరిని) చెప్పుకొనవచ్చును.

## I అత్రి వంశము

### 1) ఆత్రేయస గోత్రము :

ఋషులు–ఆత్రేయ, అర్చనానస, శ్యావాశ్వ – త్రయేర్షేయం

1. ఆకుండి (ఆకొండి), 2. కామాపంతుల, 3. చామర్తి, 4. తిరుమామిడి, 5. మహేంద్రవాడ (మహేంద్రాడ), 6. రావూరి, 7. రామఋగుల.

## II ఆంగీరస వంశము

### 1) భారద్వాజస గోత్రము :

ఋషులు – ఆంగీరస, బార్హస్పత్య, భారద్వాజ – త్రయేర్షేయం.

1. అద్దంకి, 2. అద్దంకి భాగవతుల, 3. చింతలచెర్వు, 4. చందూరి, 5. చెళ్ళపిళ్ళ (చల్లపిళ్ళ), 6. నల్దీగ (నలదీగ), 7. పత్రాయుడు, 8. పురాణపండ, 9. బ్రహ్మాయుధ, 10. వేదుల, 11. ద్వివేదుల, 12. సామవేదుల, 13. అక్కాపంతుల, 14. అబ్బావఝుల, 15. అయిలావఝుల, 16. కాకరాల, 17. గండవరపు, 18. భీమసోల

### 2) గౌతమస గోత్రము :

ఋషులు–అంగీరస, ఆయాస్య, గౌతమ త్రయేర్షేయం.

1. మద్దాల, 2. కొండారి, 3. కోట.

### 3) కుండిన గౌతమస గోత్రము :

ఋషులు–అంగీరస, ఆయాస్య, ఔతథ్య (కుండిన గౌతమ) త్రయేర్షేయం.

1. ఆయపిళ్ళ.

### 4) మౌద్గల్యస గోత్రము :

ఋషులు–మౌన, పరాకస, మౌద్గల్య – త్రయేర్షేయం. (మౌన, మౌకస మౌద్గల్య)

1. కొల్లూరు (కొల్లూరి), 2. కామవరపు.

**5) శతమర్షణ గోత్రము :**

ఋషులు–అంగీరస, విష్ణువర్ధన, పౌరుకుత్స – త్రయేర్షేయం. (ఆంగీరస, పౌరు కుత్స, త్రాసదస్య, శతమర్షణ, భద్రణ, బాదరాయణ.)

1. పంతుల, 2. పుల్లాపంతుల, 3. చిట్టిపంతుల (చిట్టాపంతుల), 4. రామవరపు, 5. ఓలేటి (వోలేటి), 6. చాగంటి.

**6) హరితస గోత్రము :**

ఋషులు–అంగీరస, అంబరీష, యౌనాశ్య – త్రయేర్షేయం. (హరిత, అంబరీష, యౌనాశ్య)

1. అన్నాపంతుల, 2. అల్లంరాజు (అల్లమరాజు), 3. పొదిల, 4. ఆయెత్తు. 5. కొండారు.

**7) కణ్వ గోత్రము :**

ఋషులు–అంగీరస, అజామీళ, కణ్వ – త్రయేర్షేయం.

1. మున్నంగి.

## III కశ్యప వంశము

**కాశ్యపస గోత్రము :**

ఋషులు–కాశ్యప, అవత్సార, నైధృవ, రేభ, రైభ, శాండిల్య, శిండిల సప్తార్షేయం.

1. ఆణివిళ్ల (ఆనవల్లి), 2. ఉపమాక (ఉప్మాక), 3. కాకరపర్తి, 4. కొలగంటి (కోలగంటి), 5. చిలకమర్తి, 6. దుడ్డు, 7. పొన్నవల్లి, 8. బొమ్మిడి, 9. మధురకవి, 10. పుల్లా పంతుల, 11. పొదిల.

## IV భృగు వంశము

### 1) భార్గవస గోత్రము :

ఋషులు–భార్గవ, చ్యవన, అన్నవాన, ఔర్య, జామదగ్న్య– పంచార్షేయం

1. అనంతపంతుల, 2. మధురాపంతుల. (మధునాపంతుల)

### 2) మాండవ్యస గోత్రము :

ఋషులు–భార్గవ, చ్యవన, అన్నవాన, ఔర్య, జామదగ్న్య – పంచార్షేయం

1. మారేపల్లి.

### 3) శ్రీవత్స గోత్రము :

ఋషులు–భార్గవ, చ్యవన, అన్నవాన, ఔర్య, జామదగ్న్య – పంచార్షేయం.

1. కంచి, 2. కాశి, 3. గుమ్మా, 4. దుడ్డూ, 5. దేశపు, 6. నశిగావు, 7. నాగాభట్ల, 8. నరసింహదేవర, 9. నృశింహదేవర, 10. పెద్దింటి, 11. బుడంచి (బుడుంబు), 12. భైరవభట్ల (భైరవబొట్ల), 13. రాఘవభట్ల, 14. వఝల, 15. సన్నిధి, 16. సోమయాజుల, 17. రామాభక్తుల (భార్గవ), 18. ఓరుగంటి, 19. పంతుల.

## V వశిష్ఠ వంశము

### 1) వాశిష్ట గోత్రము :

ఋషులు–వశిష్ట, భారద్వాజ, ప్రమద – త్రయేర్షేయం. (వశిష్ట, ఇంద్రప్రమద, అభరద్వసు – త్రయేర్షేయం.)

1. తాతపూడి, 2. కోర్సానమర్తి.

**2) కౌండిన్యస గోత్రము :**

ఋషులు–వాశిష్ట, మైత్రావరుణ, కౌండిన్య–త్రయేర్షేయం.

1. కూచిభట్ల (కూచినభట్ల), 2. భళ్ళమూడి, 3. వరదా, 4. రాజులు.

## VI విశ్వామిత్ర వంశము

**1) కౌశికస గోత్రము :**

ఋషులు–విశ్వామిత్ర, అఘమర్షణ, కౌశిక–త్రయేర్షేయం.

1. అక్కుభాగవతుల, 2. భాగవతుల, 3. అవధానుల, 4. అనంతవఝుల, 5. కోరాడవఝుల, 6. చక్రవర్తుల, 7. తోట, 8. పైన, 9. బోని, 10. ముద్దు, 11. రాజు.

**2) వాలఖిల్యస గోత్రము :**

ఋషులు–విశ్వామిత్ర, అఘ మర్షణ, కౌశిక – త్రయేర్షేయం.

1. కొల్లూరు (కొల్లూరి) 2. ద్విభాష్యం.

**3) లోహితస గోత్రము :**

ఋషులు – విశ్వామిత్ర, అఘమర్షణ, లోహిత – త్రయేర్షేయం. (విశ్వామిత్ర, మాధుచ్ఛంద, రాష్ట్రక (అష్టక) – త్రయేర్షేయం.)

1. కాకర, 2. చర్ల (చెర్ల), 3. పాలంకి, 4. పిన్నింటి, 5. పెరుమాళ్ళ.

**4) దేవరాతస గోత్రము :**

ఋషులు–విశ్వామిత్ర, (ఔదల), అఘమర్షణ, దేవరాత – త్రయేర్షేయం. (ఆంగీరస, ఆ యాస్య, దేవరాజ)

1. గోకులానంద, 2. తంపెళ్ళ.

# చౌదంతివలస
# ఆకుండి వారి వంశ వృక్షము

ఆకుండి వంశజులు 'అత్రి' సంతతివారు. వారి మూల పురుషుడు నారాయణుడు, ఈ వంశము వారు గొప్ప ఆయుర్వేద వైద్యులు. వీరిలో నారప్ప అనే ఆయన కేశనకుర్రుగ్రామం. (ముమ్మిడివరం తాలుకా తూ.గో. జిల్లా) లో నివాసమేర్పరుచుకొని వేద వేదాంగ విద్యా సంపన్నుడై ఆయుర్వేద భిషగ్వరుండై యుండెను. నాటి నుండి వీరు అప్రతి గ్రహీత లగుటయే గాక నిరతాన్నదాతలై యుండెడివారు. నారప్పగారు కామేశ్వరీ దేవతను ఉపాసించి పత్యక్షము చేసుకొనెనని చెప్పుదురు. అప్పటి నుండి వీరి సంతతివారు శ్రీ కామేశ్వరీ దేవతను కొలుచుచూ కామాకుండి (కామాకొండి) వారైరి.

ఈ సంతతిలో నొకరైన బుచ్చన్నగారు పిఠాపురం ఆస్థానంలో రాజ వైద్యుడిగా యుండెను. అదే ఆస్థానంలోగల తన జ్ఞాతుల వలన తన వృత్తికి ముప్పు పొంచియుండుట గ్రహించిన బుచ్చన్నగారు రాజావారి అనుమతితో వారి చెల్లెలి జమీందారియైన రేగులవలస (బొబ్బిలి దగ్గర) పోవుచుండెను. మార్గమధ్యమున కసింకోటవద్ద బుచ్చన్నగారు స్వర్గస్థులైరి. ఈ వార్త తెలిసిన గజరాయని వలసలోని వారి బంధువు, బుచ్చన్నగారి యిద్దరు భార్యలు, ఐదుగురు మగ పిల్లలను తోడ్కొని వచ్చుచుండెను.

మార్గమున గల చౌదంతివలస గ్రామపరిసరాలకు వచ్చుసరికి చిన్న బందను పెద్ద చెరువుగా త్రవ్వకం పనిచేయించుచున్న 'ముస్తదా'రైన రెడ్డన్నగారు (కొన్ని గ్రామముల పన్ను వసూళ్లు మొదలగు కార్యములు నిర్వర్తించు రాజప్రతినిధి) ఆ బ్రాహ్మణ కుటుంబమును చౌదంతివలసలో స్థిరపడి బ్రాహ్మణులు, వైద్యులు లేని కొరత తీర్చమనిరి. (అప్పటికి చౌదంతివలసలో ఒకేఒక బ్రాహ్మణ కుటుంబం వేదుల జగ్గన్నగారు పౌరోహిత్యం చేసుకుంటూ యుండే వారు. వారికి మగ సంతతి లేదు) అతని ఇంటి ప్రక్క గల నివాస స్థలం (యిప్పుడు మండపం యున్న జాగా) కొంత సాగు భూమిని ఇనాంగా యిచ్చిరి.

ఈ విధంగా సుమారు 1650 సం॥లో బుచ్చన్నగారి ఐదుగురు కుమారులు చౌదంతివలసలో స్థిర నివాసం ఏర్పరుచుకొనిరి. వారిలో కామన్న లింగాలవలస తరలిపోగా (ఆరికతోటలో నివాస మేర్పరుచు కొన్న కీ॥ శే॥ డాక్టరు సుబ్బారావుగారు అతని సంతతివారే) మిగిలిన నలుగురు అన్నదమ్ముల వంశవృక్షము అనుబంధంలో పొందుపరచ బడినది.



# ఇష్ట కామేశ్వరి





పద్మాసనసమారుఢా పద్మకోరకధారిణీ ।
శివధ్యానైకరసికా లింగరుద్రాక్షశోభితా ॥
శ్రీశైలారణ్యనిలయా సిద్ధిదా సిద్ధసేవితా ।
ఇష్టకామేశ్వరీ జ్ఞేయా సర్వాభీష్టఫలప్రదా ॥

